Congress Edition

# The Righteous Rogue

# ఉత్తమ వంచకుడు

## నాటకము

విజయనగర మహారాజ కళాశాలాహూణ భాషావిశారదులగు

శ్రీయుత కాశీసోమయాజుల సుందరరామమూర్తి యం. ఎ. గారిచే

విరచింపఁబడినది.



బ్రహ్మపురం భారతీ ముద్రణాలయము నందు ముద్రితము

Published by:—**Bh. N. SERMA**

*Proprietor,* VEGU-JUKKA SERIES,

*Pudipeddi vari Street*

**Berhampore**

(Ganjam.)

1 st Edition

*1000COPIES*

**1928**



వెల 0-10-0 (ఖర్చులు ప్రత్యేకము)

*For Copies apply to the Publisher.*

మన యాంధ్రనాటకములన్నియుఁ పద్యములతో పాటల
తో నిండియున్నవి. అట్లుచేయుట మనోహరతకట. నిజమే ఎవరుకా
దనగలరు? కాని వ్యావహారికభాషలో రసపోషణ చేయఁగలిగినచో
దానిలోఁగూడ నేల వ్రాయకూడదు? హరిశ్చంద్ర కథలో చివర
యంకము నేను వ్యావహారికభాషలో వ్రాసి యందులో గొన్నిరం
గములు, ఆంధ్రగ్రంథరచనా ధురీణులగు మహావిద్వాంసులకు జది
వి వినిపింపగా, వారికన్నులు బాష్పపూరితము లయ్యెను. వ్యావహా
రికభాషనే, పండితరాయలవంటి గాథవ్రాసి, కుశాగ్రబుద్ధులును, వి
ద్యాభూషణ బిరుదాంకితులు, నగు నామిత్రవర్యులు సదాశివమిశ్ర
గారికి చాల భాగములు వినిపింపగా "వ్యావహారికభాషలో నింతరస
పోషణ సాధ్యమా? మీఁదికి నీభాషలోనే గ్రంథములు వ్రాయవ
లెనని తమయభిప్రాయ మొలుఁగ జేసిరి ఆ నాటకమునే విని,
తెనుఁగున ననేకగ్రంథరాజముల వ్రాసి ప్రచురించి ప్రసిద్ధిగాంచినమ
రా. రా. భాగవతుల నరసింహకవివర్యులు కూడ నట్లేనుడివిరి

నాకు గ్రాంథికభాష యెడల విముఖత లేదు. వ్యావహారికభా
షలోఁ బామర వేద్యముగ, రసవంతముగ వ్రాయుటయే కష్టమని
నా యభిప్రాయము. ఈనాటకము బ్రదర్శించువారు తత్ఫలితమును
నాకు దయాపూర్వకముగా దెలియజేయఁ బ్రార్థితులు.

విజయనగరము,<br>
౮—౪—28.

ఇట్లు<br>
విధేయుఁడు గ్రంథకర్త

# ఉత్తమ వంచకుఁడు.

# THE RIGHTEOUS ROGUE

## ప్రహసనాంకము

### మొదటి రంగము.

మహారాజా నరేంద్ర కృష్ణరాయలువారి సభ.

ప్రవేశము—మహారాజా, నాగభూషణం, శంకరశాస్త్రి, అరుణాచలం, శ్యామలారావు, చెంగలారావునాయుడు, నిరంకుశవాణి, బంట్రోతులు మొదలైనవారు.

మహారాజు—సభ్యులారా, నేటిపని అనుకూలముగా జరిగినది. ఇప్పుడొక వింతైన ప్రశ్న వేస్తున్నాము. దానికి ధారాళమైన సమాధానము కావలెను. ఏపనిలో సమయస్ఫూర్తి, జ్ఞాపకశక్తి అన్నిటికంటే ఎక్కువ అవసరము? మొదట మాపురోహితుల సమాధానము వినగోరుచున్నాము. ఏదీ, శంకరశాస్త్రులుగారూ?

శంకరశాస్త్రి—చిత్తం, మహాప్రభో. శంకర సిద్ధాంతం బోధపర్చుటలో ఆశక్తులు ఎక్కువ అవసరం–అనంతమైన వస్తుచయము, దృశ్యములు, అదృశ్యములు, ఉన్నప్పుడు, అవన్నీ ఒక్కటే అని నిరూపించుట మాటలా? దానికి ఎంతసూక్ష్మబుద్ధి కావలెను? శంకరభగవాన్లువారు చిన్నపిల్లవాడై ఉన్నప్పుడు, వారిమాతశ్రీ ఒక రాశిలోఉన్న మామిడిపండ్లు లెక్కపెట్టుమన్నారట. "ఒకటి", "ఒకటి" అని లెక్కపెట్టినారట. "ఏమి, నాయనా, నీకు లెక్కపెట్టుటరాదా? ఆరాశిలో ఒక్కపండే ఉన్నదా?" అని వారి తల్లిగారు అడిగినారట. "అమ్మా, నాకు ఒక్కటే కనుపించుచున్నది. ఉన్నదంతా ఒక్కటే" అని అన్నారట. అది తలకెక్కించుటకు ఎంతకుశాగ్రబుద్ధి కావలెను!

ఏమా నిరంకుశవాణీ—మరొక్క గళ్లాసు ఎక్కువ తెచ్చుకుంటే సరి: అంతా పక్కనే; అంతా తానే; మరేమీ కనిపించదు. మధుపానం వ కెందుకు చెప్పినాడు?

మహారాజు—నిరంకుశవాణి, ఎందుకు చెప్పినాడు?

నిరంకుశవాణి—శంకరశాస్త్రీ, విను; విని, గ్రహించు; గ్రహించి, తరించు; మైకం చేసినవానికి, లేనిదగ్గిర ఉన్నట్టు, ఉన్నదగ్గిర లేనట్టు, తోస్తుంది. ఎవరూ లేనిదగ్గిర ఎవడో ఉన్నట్టు ఊహించి వాని మీద కేకలు వేస్తాడు. ఎదురుగా గోడ ఉంటే, అక్కడేమీ లేదనుకొని, వెళ్లిపోతాడు. (వేదాంతికి అలాంటి వెర్రి) సృష్టిలో అన్నీ కనిపిస్తూ ఉంటే, ఏమీ లేదు, అంతా మిథ్య అంటాడు. కాని కందిపప్పూ, నెయ్యీ, పాడుండబ్బీ మట్టుకు మిథ్య కాదు. ఏమీ లేనిదగ్గిర పరబ్రహ్మం కనిపిస్తూ ఉంటాడు. అలాంటి అనుభవజ్ఞానం పదార్థానికి, సోమపానం ఎంతో సాయం చేస్తుంది. పీత్వా, పీత్వా, పునః పీత్వా అని అందుకే చెప్పినారు. కాని, శాస్త్రీ

శంకరశాస్త్రి—నేర్చుకోసేవారు ఎన్నిరకాలవారో ఉంటారు. ఎవడు ఏతోవ తొక్కుతాడో? ఏ ప్రశ్నలు వేస్తాడో? వాటన్నిటికీ, వెంటనే తగిన సమాధానం చెప్పవలెనంటారా? లేదంటారా? అక్కడికి ఎంతసమయస్ఫూర్తియినా కావలెను. ఎన్నిగ్రంథాలలోను చూసి కారికలు చెప్పవలెనా, ఒప్పించడానికి? అక్కడ జ్ఞాపకశక్తి ఎక్కువ అవసరం.

నిరంకుశవాణి—గడియకు వ్యాకరణయుక్తం, గడియకు వ్యాకరణయుక్తం! "ఒప్పించుటకు" అని ఒకమాటు, "ఒప్పించేడానికి" అని ఒకమాటు! మామూలు తోవ తప్పించి మాట్లాడితే, ఇలాగే ఉంటుంది. ఏమంటారు?

మహారాజు—ఏమండీ, అరుణాచలం పంతులుగారూ, మీరేమంటారు?

అరుణాచలం—చిత్రం, మహాప్రభో. మా వైద్యంలోకూడా, జ్ఞాపకశక్తి విస్తారం అవసరమేగాని, సమయస్ఫూర్తికి అంతగా అవసరం కనబడదు.

నిరంకుశవాణి—నేను సాయం చేయనా? ధన్వంతరిగారూ? మంచి సమయస్ఫూర్తి అయిన ఉదాహరణ చెప్తాను వినండి—ఇది నా సమయస్ఫూర్తి సుమండీ, ఎవరిదో అనుకోనేరు. మా నాయనమ్మ ఉండేది. నన్ను చూస్తే, ఆమెకు ఇంతంత ప్రేమని చెప్పలేను. ఆవిడకు నూలుపోడివేసిన బచ్చలకాయకూరయందు ఎంతప్రీతో, నాకు పకోడీలయందు ఎంతప్రీతో—శంకరశాస్త్రికి స్తోత్రపాఠముందో, నా బోలునూ?—అంతకంటె ఎక్కువప్రీతి నన్ను చూస్తే ఆవిడకు. ఆవిడకు ఒకమాటు చాలా జబ్బుచేసింది. వైద్యుడువస్తే, "ఎలాఉంటుంది మా ముసలావిడకు?" అన్నాను. ఆయన జవాబిచ్చినాడుగదా, "ఏలాగుపడితే అలాగర్థం అవుతుంది. "ఈమందు పనిచేయనిపక్షంలో తేలి కూర్చుంటుంది వెంటనే" అన్నాడు. మరొక రోగిని చూడడానికి అవతల వీధిలోకి వెళ్లాడు. వెళ్లాడు, మా ఇంట్లో గొల్లుమన్నారు. అప్పుడు ఆయనగారి మనస్సులోమాట అర్థమయింది. గొంతుకలో మందు దిగుతేకాదా, పనిచేయడానికి? "కార్తికస్నానాలు చేసి, నన్ను విద్రిమంచంమీదనుంచి లేపినా, వైద్యం నా చేతిలో ఏవరుపెడతారుగని ఏడ్చాను. తలచుకొంటే, నాకు మళ్లీ ఏడుపొస్తున్నది. ఆ వైద్యుడు మరెవరూ కారు; మీనాన్నగారే! ఆయనమాటలు సమయస్ఫూర్తి కాదూ?

మహారాజు—శ్యామలాప్రపంతులుగారి అభిప్రాయం ఏమిటి?

నిరంకుశవాణి—ఏమంటాడు? తనకొత్యాలుపనికి అన్ని తెలివితేటలూ కావలెనంటాడు—చెంగల్రావునాయుడ్ని అడుగుతే, తన ఇస్నె ఎక్కటరుపనికి అన్నీ కావలెనంటాడు. మరి యెవ్వర్ని అడగడమెందు

కు? గడ్డితవ్వుకొనేవాణ్ని అడుగుతే, వాడిపనికి అన్నీ కావలెనంటాడు
వాడికృషి లేదుగాని.

శంకరశాస్త్రి—వాని ప్రతినిధివి నీవున్నావు. చాలదూ?

నిరంకుశవాది—పరమేశ్వరా వేదాంతియొక్క ప్రతినిధిగా
ఉండడం ఆపదమట్టుకు నాకు రానియ్యకు. అంతా ఒక్కటే అంటా
డు, కాని తనబాకీరాబట్టుకోవడంలోనూ, అంటిమామిడిపళ్లు తిన్న
డంలోనూ మట్టుకు అంతా ఒకటికాదు. పదిపళ్లతినడమూ, ఒకప్ప
డు తినడమూ ఒక్కటే అంటాడా? శంకరునిగణితము ఇచ్చిపుచ్చు
కోవడాలలో ప్రయోగించి ఎన్నాళ్లు బ్రతుకగలడు? అంతా వాడే
అట! దున్నపోతునుచూచి అది తానే అంటాడు. నయంకాదూ తన
దీ అనడూ! కడుపు భూమికి అంటుతూన్న జంతువునూ మనము,
తిండిపెట్టినదానికంటె మనకు ఎక్కువ నౌఖరీచేసే జంతువునూ,
చూచి, ఆజంతువులు తానేఅంటాడు. అందరికీ తెలిసేభాషలో, వా
టిని, శాస్త్రి, పందీ, కుక్కా అని అందునుగాని, పందీ, కుక్కా అ
భ్యములు. ఇటువంటి సభలో వేదాంతినిగూర్చి మాట్లాడుతూ, పం
దీ, కుక్కా అంటానా? అలాగే, పంచమస్త్రీని చూచి, తనకు
దానికీ అభేదమంటాడు. మోసగాడు, జూదరి, త్రాగుబోతు, వార
దరూ తానూ ఒక్కటే అంటాడు. ఆజంతువులలోనూ, ఆమనుష్యు
లలోనూ ఉన్నవెలుగే తనలోనూ ఉన్నదట. అటువంటి వెలుగు
నలో పెట్టుకొని జ్ఞానబోధ చేయవలెనంటే, మాటలా, మరేమిటో
గాని? మందిచ్చేటప్పుడు, వైద్యునికి ఆవేదాంతంకుదిరి, ఏమందిచ్చి
నా ఒకటేఅంటే ప్రాణాంతం.

మహరాజ—మాదివానగారి అభిప్రాయం విందాం.

నాగభూషణం:—చిత్తం, మహాప్రభో. అన్నిటికంటె విశే
ముగా ఆశక్తులు మోసపుచ్చుటలో అవసరం.

మహారాజ—(కోపముతో) ఏమి! ఏ!మి

నిరంకుశవాణి—నాగభూషణం పంతులుగారికి, మోసగానికి కావలసిన ఆ రెండుశక్తులు పరిపూర్ణముగా నున్నవి. వారి ఉద్యోగమునకుకూడా మోసగాని సామర్థ్యము అవసరమే.

మహారాజు—రాజ్యతంత్రములో అవి ఎక్కువ అవసరమని అంటారని అనుకొంటిమి.

నిరంకుశవాణి—ఎవరి అనుభవములో ఏదిఉంటే, అది మనవి చేసినారు. నాగభూషణం పంతులుగారు తన అనుభవము తెలియజేస్తే తప్పేమి?

మహారాజు—మోసగాని సామర్థ్యముచూచి మీకు అసూయ కలిగినదా?

నిరంకుశవాణి—మోసగానిచేవ తనకులేకుంటేగదా, అసూయపడడం?

మహారాజు—సరే, ఒకసంవత్సరము గడువు ఇచ్చినాము. ఆలోపున మీరు చెప్పినదానికి నిదర్శనము కనపర్చలేకుంటే మీతల మీదకాదు. ఆలోపున మీచర్యలలో ఆ నిదర్శనము కనపర్చకుండా మట్టుకు మేము కనిపెట్టుచూ ఉంటాము.

నిరంకుశవాణి—ఇన్నాళ్లూ దొరకనిమనిషి, ఇటువైని మాత్రం దొరకుతాడా ఏమిటి? చేయడానికి ఎన్ని తెలివితేటలు కావలెనో, పట్టుకోవడానికి అన్ని తెలివితేటలు కావలెను. దొంగను దొంగే పట్టవలెను.

మహారాజు—వచ్చేమాఘమాసమువరకు గడువు. మా మాటకు తిరుగులేదన్నమాట మీకు తెలుసును. (దివాన్, విదూషకుడు తప్ప అందరూ నిష్క్రమింతురు)

నాగభూషణం—ఏమిలాగు తిరిగినది!

నిరంకుశవాణి—మనము ఎలాగు త్రిప్పితే అలాగు తిరుగుతుంది.

నాగభూషణం—నామనస్సులో ఉన్నది ఎందుకు చెప్పినాను?

నిరంకుశవాణి—అవును, ఆహారపాటు ఎన్నడూ చేయనివా డవు, నేడేల చేసినావు?

నాగభూషణం—భగవంతుడా, నాకేమిదారి?

నిరంకుశవాణి—మోసపుచ్చడమెలాగో అడిగితే భగవంతుడు చెప్తాడా? నన్నడుగు చెప్తాను.

నాగభూషణం—ఏమిటది?

నిరంకుశవాణి—ఆగుమ్మం-తలుపులు తీసిఉన్నప్పుడే, తోవ తీయడం బుద్ధిమంతుల లక్షణం. ఈరాత్రి, కూర్చున్నచోటుతో కూడా చెప్పకుండా, దాటేయ్! ఉన్నరొక్కమంతా ఎంతలో మూటకట్టాలి? నీవు ఆర్జించినదంతా ఎందరుతిన్నా తెరగదు. అదంతా భూములమీద పెట్టావుకాని వాటికోసం ఉండిపోయినావంటే, నీకు ఆరడుగుల భూమేప్రాప్తి, చూసుకో-దండాన్ని పట్టుబట్టలు అట్టే ఉన్నాయని, నడికప్పంటుకొన్న కొంపలోకి వెళ్లినట్లవుతుంది.

నాగభూషణం—నోరుమూయి, అవివేకపశువా?

నిరంకుశవాణి—నీకు అంతకోపం ఉందోయ్, నాగభూషణం? నేడు నీవు మననరెందరి కృష్ణరాయప్రభువువారి సభలో కనపర్చిన వివేకముకంటె నా అవివేకమే క్షేమం. ఓయ్ వెర్రివాడా, నీకు స్ఫురించలేనందుకు ఆశ్చర్యపడుతున్నాను. మన ఆంధ్రదేశమంతా ఒక్క మార్గుగాలించి, సీతో కొత్తాఉన్న పెదమోసగానిని రప్పించి, వానికి చేయి బాగాతడిచేసి, తరించవోయ్-కాని మాకొంపలమీద మట్టుక్కు పడనీయకేం.

నాగభూషణం—బాగుంది, బాగుంది! (నిష్క్రమించును)

నిరంకుశవాణి—ఇక రాజమహేంద్రవరానికి అరిష్టం వారి శాడు. (నిష్క్రమించును)

గో—ఒక్కగంట ఆలస్యానికే ఇలాగైనదానవు, చాలాకాలము రాజధానిలో ఉండవలసివస్తే, ఏమంటావో?

జా—నిజంగా రాజమహేంద్రవరము వెళ్లా లేమిటి?

గో—నిజంగా వెళ్లాలి.

జా—వల్లకాదుసుమండీ, నేనుమీాలోఉన్న ఈనాలుగేళ్లూ ఒక్కనాడైనా మిమ్ములను వదలిఉండలేదు-మూడేళ్లక్రిందట మా చెల్లెలు పెళ్లికి నన్నుతీసుకోవెళ్లడానికి మానాన్నవస్తే, మీాకు వెళ్లడానికి తీరందికాదని, నేనూ వెళ్లలేదు-ఇప్పుడేమిటి ఆరాచకార్యం అక్కడ?

గో—జానకీ, నిన్నువదలివెళ్లడం నాకుమాత్రం ఇష్టమనుకొన్నావేమిటి? కాని, ఈ ఉత్తరంవిని, నేనేమిచేయవలసియున్నదో నీవేచెప్పు-(చదువును).

"శ్రీవేదమూర్తులయ్యిన బ్రహ్మశ్రీ వేదాల గోపాలశాస్త్రులుగారి సముఖమునకు-గోముఖం నాగభూషణం అనేక నమస్కారములుచేసి చేయుంగల విన్నపములు త॥.

ఇక్కడ నేనుతప్ప అంతాక్షేమం. నాకు ప్రాణహాని రానచ్చును-వెంటనే వచ్చినన్ను కాపాడవలెను. నీవు విశేష ధనికుడవు కాగలవు. మహారాజా నరేంద్ర కృష్ణరాయలువారి దివానుయొక్క కృతజ్ఞత ఊరకనేపోదు. 7, 8 సంవత్సరములక్రిందట—బహుధాన్యలో అని జ్ఞాపకం—మనము కృష్ణరాయ అగ్రహారంలో కొన్నిమాసములు గడిపినది నీకు జ్ఞాపకం ఉండవచ్చును. అప్పుడునీవు కనపర్చిన విద్యవల్ల, ఇప్పుడునన్ను కాపాడ సమయము వచ్చినది. నీకు సుందరమ్మపేటఅంటే ప్రాణపదమని నాకు తెలుసును. కాని ఇప్పుడు ఇక్కడికి రాకతప్పదు. మానాన్నగారు మహారాజావారివద్ద ఉన్నప్పుడు, మీానాన్నగారికి సుందరమ్మపేటలో ఆరు ఎకరములు ఇప్పించినారు. నీవు వాటితో దొడ్డికట్టగా నాలుగు ఎకరాలు కొనుక్కొని హాయిగా ఉన్నావని విని ఎంతో సంతోషించినాను. నీవునన్ను కాపాడిన యెడల ఆ పదిదగ్గర సున్న పెట్టించగలను.

జా—లేకుంటే, ఆపది సున్నా పెట్టిస్తాడు కాబోలు?

గో—దివానే దివాను. ఏమిచేయవలెనంటే, చేయలేడు? కప్పా, విప్పా సమర్థుడు. లేకుంటే ఈ ఎనిమిదేళ్లలో అన్నిగ్రామాలు ఎలాకొన్నాడు? బంగారంపండేవి? కాని, విను. (చదువును) "నీవు ఈఉత్తరం అందిన తక్షణం బయలుదేరుతావని నమ్ముతాను.

రాజమహేంద్రవరం
వ్యయనామ సం॥ మాఘ
శుద్ధచవితి.

చిత్తగించవలెను,
విధేయుడు,
గో॥ నాగభూషణం

విన్నావుగదా, జానకీ, ఏమిచేయుమంటావు?

జా—ఈఉత్తరం ఎవరు తీసుకోవచ్చారు?

గో—తురుపుసవారు బాలాజీచేత పంపించినాడు. ఇంటికి వస్తూంటే, తోవలో ఇచ్చినాడు. పాపం, 60 మైళ్లుతోవా 6 గంటలలో ఏకాయెకీగా వచ్చినాడట. మళ్లీ నాజవాబుపట్టుకొని వెంటనే బయలుదేరాలట?

జా—మీయిద్దరికీ అంతస్నేహం ఎలాగుకలిసింది?

గో—అతనితండ్రి చేతిక్రింద మాతండ్రి పనిచేసేవారు. నేను 15 ఏళ్లవాడనై ఉన్నప్పుడు, నాగభూషణం మహారాజావారివద్ద దివాన్ పేష్కారుగా ఉండేవాడు. ప్రభువారి దయవల్ల దివాన్ పదవి వచ్చింది. తిన్నగాఉండక జబ్బుపడి తండ్రిఉన్నగ్రామం, కృష్ణరాయ అగ్రహారం వచ్చినాడు-మాతండ్రినన్ను ఒకనాడు వారింటికి తీసుకోవెళ్లి నాకు హుజూర్ కచేరీలో ఏదైనా ఉద్యోగం ఇప్పించమంటే, "ఇంతచక్కనివాడు రాజమహేంద్రవరములో ఉంటే, ఎందుకైనా పనికివస్తాడా?" అన్నాడు.

జా—తమర్ని ఎంతవాడైనా ఊణతపరుస్తే, మాటకి పది మాటలు అప్పగించవలసినవారే, మీరేమన్నారు?

గో—"ఈగ్రామంలో మాత్రం మనుష్యులు లేరా? మరినన్ను ఎవరింటికైనా రానియ్యడంమాత్రం క్షేమమా?" అన్నాను.

జా—బలే! మాబాగా అన్నారు!

గో—ఇంతేనా అన్నాను? "మీరు అక్కడ శరీరంచెడుపుకొని, ఇక్కడికి ఔషధసేవ చేయడానికివచ్చినారు గనుక, నన్ను జాగ్రత్తగా ఉంచుమని చెప్పడం, మీకు మాయందున్న 'అభిమానంచేతనే" అని వెంటనే ఇంటికి వెళ్లినాను. నేనూ ఇంటికివచ్చాను, నాగభూషణం తలుపు పిలిచాడు.

జా—ఆఁ!

గో—వచ్చి, కళ్లనీళ్లమడుగులో రమ్యమైన కలవపువ్వులాగు, హృదయంనిండా కళ్లుపెట్టుకొని, ముఖానికి వెలుగిచ్చే చిరునవ్వునవ్వి, "గోపాలశాస్త్రీ, నామాటకు కోపంవచ్చిందా? నేను వట్టినే హాస్యానికి అన్నానుసుమా" అన్నాడు. "నీవంటే హాస్యమూ, నేనంటే కోపమున్నా, నాగభూషణం?" అన్నాను.

జా—"నీవు" అంటే "నీవూ" అనడమే అంతవాణ్ణి!

గో—అనకేమి? మనగౌరవము మనముకాపాడుకోకుంటే, మరెవ్వరు కాపాడుతారు? ఒక్కవారంలో మానాన్నగారికి మన సుందరమ్మపేటలో దివ్యమైనది ఆరు ఎకరాలు ఇప్పించినాడు.

జా—మీరు అతనికి కనపర్చిన విద్యంటాడు, ఏమిటది?

గో—దొరికిపోకుండా టోపివేయడం. టోపీవేసి వాణ్ణి ఎన్నిమాటలలో ఏడ్పించి, మళ్లీ యిచ్చివేసేవాణ్ణి. ఇప్పుడు దానివల్ల అతడ్ని కాపాడవలెనట.

జా—ఇప్పుడు అతనికివచ్చిన ప్రాణభయమేమిటి?

గో—మొన్ననేమో దర్బారులో, "దేనిలో సమయస్ఫూర్తి జ్ఞాపకశక్తి విస్తారంగా కావలె"నని ప్రభువువారడిగినారట. "మోసంచేయడంలో" అని నాగభూషణం అన్నాడట-అంటే చాలాకోపగించి, ఒకసంవత్సరంలో దానికి నిదర్శనం కనపర్చకుంటే, తల కొట్టించేస్తానని ప్రభువువారన్నారట, ఇదంతా బాలాజీ చెప్పినాడు.

జా—అభిప్రాయభేదముంటే, అంతపని చేయవచ్చునా? తప్పు కాదూ?

గో—తప్పేమిటి? ఘోరము! పరిభూతవారికి అది మనస్సుకు నాటేటట్టు చేయడం నావిధి కాదూ?

జా—(కొంతసేపూరకొని) విధే—కాని, మీప్రాణ—

గో—ఆకన్నీ రెందుకు, జానకీ? నాప్రాణముమీదికి వస్తుందని, భయం? వస్తే, రానీ-రాజుకు అంత తొందరపాటుంటే, దేశానికి ఎంతఅరిష్టం! దివానువంటివాడికే అలాగైతే, తక్కినవారిగతి ఏమి కాను? దివాన్ని కాపాడడము, దేశానికి ఉపకారం చేయడమే కాదూ?

జా—అ—వు—ను-ఉపకారము చేయడమే మీరభ్యసిస్తున్న మతమని నాకు తెలుసును. ఇందులో ఆత్మలాభము మీకు ఆకర్షణ కాదనీ తెలుసును. దేశసేవకొరకు మీరు వెళ్లుతుంటే, నేనేమనగలను? కాని—కాని—

గో—జానకీ, ఆమాటలేమిటి? ఆఉదారభావమేమిటి? ఆకన్నీళ్లేమిటి? నీబుద్ధికి తగదు అది.

జా—ఆమాటలు నామనస్సులోనుంచి వస్తున్నవి; ఆకన్నీళ్లు నాహృదయంలోనుంచి వస్తున్నవి. ఏమిచేయను? కాని, మీతో ఉంటేమట్టుకు నడిగోదావరిలో ఉన్నా నాకు భయంలేదు, అరణ్యమధ్యనున్నా భయంలేదు.

గో—బొందినిప్రాణం విడచిపెట్టడ మేమిటి? నిన్ను నేను విడిచిపెట్టి వెళ్లడమేమిటి? పైనుంచి, వంటిమీద పేలాల్లాగు పువ్వులు రాలుతూంటే, కాగుచెట్టుక్రింద పచ్చికమీదకూర్చొని, నీవు వాల్మీకమో, నాటకమో రాగవరసను చదువుతూంటే వినడమనా, మాలతిపందిరక్రింద నీతో చదరంగం ఆడడమనా, ఎందుకు వెళుతున్నాను, జానకీ? అక్కడనేను ఏమిచేయవలసి ఉన్నదో, ఎక్కడ ఉండవలసి ఉంటుందో,—బెదరకూ—ఏమిప్రమాదములు తప్పించుకోవలసి ఉంటుందో, నాకే తెలియదు. నీవునాదగ్గిర ఉంటే, ఇద్దరికీబాధే-తోటమాలి ఇక్కడేఉంటాడుకదా. మనకుక్కలునాలుగూ నూరుమంది

కావలివాళ్లు పెట్టుకదా-ఇంటినిండా ఏటేపడాదికీ సరిపడా కావలసిన వన్నీ సమృద్ధిగా ఉన్నవికదా-మరి కంట తడి పెట్టక, నవ్వుచూ నన్ను వెళ్లనీ.

జా—(తనలో) అంత ప్రమాదమైన పనిమీాన ఆయన వెళ్లుతూ, నాక్షేమం గురించి మాట్లాడడ మేమిటి?—మీాప్రయాణం ఎప్పుడు?

గో—భోజనం చేసి—ఒక గంటలో— బాలాజీ ఇక్కడే భోజనం.

జా—సరే, నేను వంటింటిలోకి వెళుతున్నా-దానయ్యా, లేత వంకాయలూ, పచ్చిమిరప కాయలూ, నిమ్మపళ్లూ, కొత్తిమిరీ వెంటనే తీసుకోరా.

దానయ్య—(లోపలనుంచి) తెస్తానమ్మా

జా—చూడూ, సంపెంగతుప్పదగ్గర ఉన్నది, రెండు అల్లంగడ్డలుకూడా తవ్వుకోరా-గుర్రాన్ని దగ్గరుండి, తోటలో గడ్డి మేపించమని బాలాజీతో చెప్పు

దానయ్య—అలాగేనమ్మా

జా—నేనువండుతూంటే, ఉన్న ఒక్కగడియా, తంబూర వేసుకొని చల్లగా బాడరూ? మళ్లీ ఎన్నాళ్లకు వింటానో? ఆరభి—

గో—అలాగే, నీకిష్టం వచ్చినది పాడుతాను-(తనలో) ప్రభో, రామచంద్రమూర్తీ, నాజానకిని కాపాడి, నన్ను మళ్లీ ఆమెకప్పపెట్టు-(తెర)

## మూడవ రంగము

రాజమహేంద్రవరము నారాయణసెట్టియిల్లు, ప్రవేశము, రంగయ్య, ఒక బ్రాహ్మణుడు.

బ్రా—అబ్బాయీ, రంగయ్యా, మీాఅయ్య ఎక్కడున్నాడు.

రం—(ఆవులిస్తూ) ఇప్పుడే లోపలికి బోజానికి ఎల్లినాడు.

బ్రా—అతనితో తొందరగా మాట్లాడవలసిన పని ఉన్నది.

రం—లోపలికెళ్లండి. (తనలో) నల్లగా ఎలుగుబంటిలాగు ఏలాగున్నాడో!

బ్రా—(లోపలికి వెళ్లుచూ) ఎంతయిల్లు! ఎంతయిల్లు! రెండు భవంతులు దాటినా ఇంకాయిల్లే! ముందుభాగం వ్యవహారానికి, వెనుకభాగం కాపురానికి, మా బాగుంది ఏర్పాటు. అదుగో నారాయణశెట్టి స్నానం చేస్తున్నాడు. (నారాయణశెట్టి ప్రవేశించును.)

నా—దణ్ణాలు, శాస్త్రుల్లుగారూ!

బ్రా—నీ మనుమలతో దాగుడుమూతలాడుచూ, వారిపిల్లలకు సంబంధాలు వెతుకుచూ, వాళ్లకు ఇంతేశి లోగిళ్లు ఒక్కొక్కరికి ఒక్కొక్కటి కట్టు!

నా—ఏం? పనిమీదగాని వచ్చారేటి శాస్త్రుల్లుగారు? రత్నాలు, ముత్యాలు, బంగారం ఎవరికైనా ఖరీదు చేయించడానికి వచ్చారా?

బ్రా—వాటితోనూ త్వరలో పనిఉంచుందిగాని, ప్రస్తుతం గొంతుక ఆర్చుకోపోతూంది. ఇక్కడే రెండు కోసులుంచుంది, ఒక గ్రామంలో వివాహం చేయించి వస్తున్నాను. ఈ మాఘమాసంలో మాబ్రతుకు ఇలాగే ఉంఛుంది. మంచి తేటిస్తో. వ్రాశాలు నిలబడ ఛాయి మీయింట్లో మామంచిది ఉంఛుందంఛారు.

నా—సూడండీ, ముందుకొట్టుకాడ మా శెట్టోడుంటాడు—ఆడ్నడగండి. పదిగూనలతో ఎట్టాం, అన్నీపళిన పుల్లనితేట—

బ్రా—ఆతడియ్యకుంఛే?

నా—ఎందుకియ్యడూ? మాకోసంగాని ఎట్టామేటి?

బ్రా—ఇందాకా అడుగుతే, ఇయ్యనన్నాడూ, అందుకూ అడిగాను.

నా—ఇయ్యకుంటె, అక్కడనుంచి గట్టిగా కేకెట్టవయ్యా నేను బుద్ధిచెప్తాను.

బ్రా—సరే. (కొట్టుదగ్గరకువచ్చి) రంగయ్యా, ఊళ్లో కబుర్లు తెలుసునా?

రం—నాకు ప్రపంచం సంగతి తెలుసును.

బ్రా—ఆఁ! ఆలాగా?

రం—అవును. ఉన్నోడు తినడం, లేనోడు పస్తు.పడుకోవడం.

బ్రా—అలాగు కాదోయ్. లేనివాడు పస్తు పడుకుంటాడను కోకు-డబ్బున్నవాణ్ని తక్కువ డబ్బున్నవాణ్నిగా చేస్తాడు, దరిద్రుని మరీ దరిద్రునిగా చేస్తాడు, శుభ్రంగా తింటాడు. ఒక్కటె పెట్టుబడి కాదు. బలము ఒక పెట్టుబడి, మోసము ఒక మదుపు ఆ రెండూ లేనివాడే అడుక్కోవడం-పోనీ దానిమాటకేమి? ఇదుగో చూడు (ఇంకా దగ్గిరా కూర్చొని) ఊళ్లోకిచాలావింతైన దొంగలొచ్చారు. అటికాలుకింద కన్నం వేసేవాళ్లు. ఈ రాత్రి మీాలోగిట్లో ఒకచూపు చూస్తారట-

రం—నీనలుపుచూస్తే, నువ్వు ఆళ్లలో ఆడిలాగే ఉన్నావు.

బ్రా—నేను నల్లగా ఉండాలని బ్రహ్మదేవుణ్ని కోరేనా యేమి? నేను అందులోవాడనైతే, నీతో వాళ్లమాట చెపతానా?

రం—అయితే, ఆళ్లసంగతి నీకేం తెలుసును?

బ్రా—నాకు ఎలాగో తెలుసును-నీకెందుకది? అదిమీా అయ్యతో చెప్పడానికే వచ్చాను. నాకు చాలా స్నేహితుడు. లేకుంటే, ఇలాంటి ఎండలో రావడానికి నా పుట్టిమి మునిగింది? ఎందుకొచ్చాను, అంటాను.

రం—ఎల్లెల్లవయ్యా, నువ్వూ నీనలుపున్నూ. ఈ ఊళ్లో దొంగబయ్యం ఎప్పుడూ లేదు.

బ్రా—ఎందుకలా గురుస్తావు, మీా అయ్యతో చెప్పితే, కొట్టులో భోషాణంలో ముత్యాలు, రత్నాలు, బంగారం తీసుకొని ఆపెట్టెలు మాయింటిలో పెట్టుమన్నాడు. మీా అత్తవారుపెట్టిన ఆ వజ్రాలమాల కూడాను, నీమెళ్లోది. చూచావా, పేదవాళ్లిళ్లకు

దొంగలు పారుకాదూ? అందుకూ. కానీ చురుగ్గా, దంతం పెట్టి పయి కిత్తేయి.

రం—ఏటీ! ఎంటనే ఎల్తావా, పోలీసోణ్ణి పిలమన్నావా?

బ్రా—ఏమైనా పోయినప్పుడు పిల్తువుగాని పోలీసువాణ్ణి. (గుమ్మం దగ్గిర నిల్చొని) ఇదుగో, నారాయణచెట్టీ, చూచావా, నేనన్నట్టే అయింది. నీకొడుకు ఇయ్యడట! మళ్ళీ అడుగుతే, పోలీసువాణ్ణి పిలుస్తాడట. పోలీసుని సాయం ఏదైనా పోతే అవసరంగాని, నన్ను బైటికి వెళ్ళగొట్టడానికెందుకు? పొమ్మంటె, మీచూరులు పట్టుకొని వేళ్ళాడుతానా ఏమిటి? అలాంటిమనిషి దగ్గిరకు నన్నెందుకు పంపినావు? నేనునల్లగా నున్నానుకాదూ అందుచేత దొంగనట! (గొంతుతగ్గించి) నీముత్యాలు, రత్నాలు, అవన్నీ పోతే, మంచి పోలీసువాణ్ణి నేనే పిలుస్తానులే. (బిగ్గరగా) నామాట ఇంతచులకనగా చూచినందుకు అనుభవిస్తారులే. ఇంత ఎండవేళ ఎందుకొచ్చాను మీయింటికి? (మెల్లగా) నన్ను నీ వెరుగుదువుగాని, మీ పిల్లవాడెరుగడు. (బిగ్గరగా) పోనీ, నాకేమి? వెళ్ళుచున్నా (కోపముగావీధిలోకి వచ్చును)

నా—(లోపలనుంచి బిగ్గరగా) శాస్త్రుల్లుగారూ, శాస్త్రుల్లుగారూ ఎల్లిపోకండోయ్! బాబ్బాబు, కోపం శేయకండి! రంగా, గాడిదా, నీ దగ్గిరకి నేను పంపిన బ్రాహ్మణ్ణిఅలాగు చేస్తావురా మొద్దా? అతగాణ్ణి దొంగంటావురా పశువా? ఆయనుచ్చుకొన్నంత ఇచ్చి ఎంటనే పంపించేయరా-ఎంటనే ఇస్తావా, తానం మానేసి నేనొచ్చి ఇయ్యాలా? నీ తెలివి తక్కువవల్ల మన కొంపతీశేస్తావురా, దున్నపోతా? శాస్త్రుల్లుగారు, ఎల్లిపోకండి. వచ్చి పుచ్చుకొని మళ్ళీ రచ్చించండి. రంగా, ఇనిపించిందా?

రం—ఆఁ, ఇనిపించింది. ఇదిగో తెగుస్తున్నాను-రండీ, శాస్త్రుల్లుగాలూ-చమించండి-మీరుమోయగలిగినన్ని ఇస్తాను, రండి, కూకొండి, శాలూ పరండి.

బా—నారాయణ చెట్టి, ఇది [illegible] న్నిమ, [illegible] పుచ్చుకొం చున్నానుకే. తుదకు బుద్ధొచ్చింది కు[illegible] (రంగయ్య దంతపు పెట్టెలు తెచ్చి శాలువులో ఉంచును) [illegible] మంచి ముత్యాల పెట్టెలు, 108 రత్నాల పెట్టెలు, పదేనుకో [illegible] మూయింటిలో పెట్టి, బంగారానికి మళ్లీ వస్తా. నే వెళ్తా. [illegible] వచ్చేదాక ఇక్కడే కూర్చో. జాగ్రత్త సుమా. భగవం[illegible] నూరేళ్లు ఆయుష్షుం ఇంకా ధనం, పిల్లలు ఇస్తాడు. బుద్ధిగాఉ[illegible] ([illegible]టతో నిష్క్రమించును)

## నాలుగవ రంగము

దివాన్ ఇల్లు: ప్రవేశము, గోపా[illegible]శాస్త్రి, దివాన్.

నాగ—గోపాలశాస్త్రి, నిన్న [illegible] వచ్చావు, ఈమధ్యాహ్నము, కోటీశ్వరుడు, నారాయణచెట్టి [illegible] చేశావు. 15 గంటలలో 60 మైళ్లు నడచావు, ఈ రోజు [illegible]తీసి అడుగు పెట్టలేవనుకొన్నాను.

గో—నాగభూషణం, రాత్రికి [illegible]హింసప్రవరం చేరాలని వ్రాసిన వాడవు, మంచి బండీ ఒకటి [illegible]చాలని ఎరగవూ? ఎక్కడ సుందరమ్మపేట? ఎక్కడ రాజ[illegible]ప్రవరము? అయితే వ్యవసాయం చేసుకొనే వాడికికూడా [illegible]మూ? అని అనుకొన్నావు కాబోలు?

నాగ—శాస్త్రి, తప్పు క్షమించాలి. [illegible]చారంగా ఉన్నది—

గో—నాగభూషణం, నాజూకు [illegible]లో, అర్థములేని మాటలు నాలుగు లేవని పిస్తున్నాయి,—"[illegible]మించు" అన్నదొకటి, "చాలా సంతోషించినాను" అన్నదొకటి "[illegible]లావిచారంగా ఉన్నది.

అన్నదొకటి-ఆలోచిస్తే నన్నదొకటి-ఇక చేష్టలలో, మందహాసానికి ఎన్ని అర్థాలో ఉన్నాయి—

నాగ—నీవేమన్నా వడిపట్టాలి. కాని నారాయణసెట్టితో వ్యవహారం ఇట్టే తెమల్చేశావు.

గో—పదినిమిషాలలో—

నాగ—నీవర్చస్సు అంత తెల్లటిదిగదా, వంటినిండా ఆపసరు రాసుకొంటె, నిజంగా అంతనల్లగా అయిపోయావూ?

గో—ఆహా.

నాగ—చెమటపట్టినా పోదూ?

గో—స్నానం జేసినా పోదు.

నాగ— శాస్త్రీ, ఒక్క ప్రశ్నకు సమాధానం చెప్పూ-రంగయ్యకొట్టు తాళం వేసుకొని, ఇప్పుడే వస్తానని చెప్పి లోపలికివెళ్లి, ఆ బ్రాహ్మణునికి పెట్టెలోదంతా ఇచ్చివేసేటంత ప్రమాదం ఏం వచ్చిందని అడుగుతే?

గో—మరినాకా కాళ్లులేవు? వాడులోపలికివెళ్లి వచ్చేసరికి, నాకు ఈ ఉదయం నీవిచ్చిన గదిలో ఉండి ఉండనూ? గది ఒక ఫర్లాంగేనా ఉన్నది? రానూపోనూ సెట్టియిల్లుకూడా ఫర్లాంగు పొడవుంటుంది. కాని వట్టినే దాటేసి ఉండుననుకొన్నావా? రంగయ్య లోపలికి వెళ్లాడేమి, నేను వీధితలుపు గొళ్లెం పెట్టానేమి? తండ్రిక్కొడుకూ గుమ్మం దగ్గిరికివచ్చి, మళ్లీలోపలికి వెళ్లి తిరిగి అవతల వీధిలోనుంచి వచ్చేసరికి, నేను నాగదిలోకి వెళ్లడం, పసరుకడిగివేసి ఎప్పట్లాగు తయారు కావడం, జరిగి ఉండదూ? నా గదికి రెండువీధులలోకీ రెండు ద్వారములున్నాయి. ఒక గుమ్మాన్ని వెళ్లి, రెండో గుమ్మాన్ని వచ్చాను.

నాగ—రంగయ్య పోలీసువాణ్ణి పిలిచుంటే?

గో—అంత ఎండవేళ ఎవడైనా దొరుకుతాడనికట్టు, మా యిద్దరికీ జరిగిన దానికి సాక్ష్యం ఏదీ?

నాగ—కాని, నీవు తెచ్చిన మూటలో పైకి కనిపించేలాగు తోటకూర కాడలూ, ములంకాడలూ, అనపకాయ బద్దలూ, ఎందు కున్నాయీ?

గో—మూటలోవి అన్నీకూరలే అని వీధిలో వాళ్లకు అనిపించడానికి.

నాగ—అయితే పచ్చశాలువ మూటకి తెల్లగుడ్డ చుట్టపెట్టినా వెందుకూ? మాసిపోతుందనా?

గో—కాదు. నేనుమాపినవాళ్లు నన్ను పచ్చ శాలువతో చూచినారు. దానితో మీయింటికి వస్తే, డేకాయిస్తుందేమో అని.

నాగ—ఇంత అద్భుతమైన పన్నాగం ఎప్పుడు పన్నేవోయ్?

గో—ఈ ఉదయం నీవు ఊరు చూపిస్తూ నన్నుబండీలో కూర్చోపెట్టుకొని తీసుకో వెళ్లినప్పుడు సెట్టినిగురించి చాలాదూరము చెప్పి ఆయిల్లు చూపించావే, అప్పుడు కార్యక్రమం అంతా ఏర్పాటు చేసుకొన్నాను-కూరలు ముందుగాకొని గదిలోఉంచి మరీ బయలుదేరినాను. ఇప్పుడే మాతాత వరహాలమూట మీ నేలమాన్యంలో ఉంచు.

నాగ—మాయింట్లో నేలమాన్యంఉందని నీకెలా తెలుసును?

గో—ఒకగదిలో నడుస్తూంటే, చప్పుడునుంచి ఆ నేల గుల్లగా ఉందనిపోల్చాను.

నాగ—శాస్త్రీ,ప్రాణంలేనివికూడా నీకు సాయం చేస్తాయోయ్!

గో—ప్రాణంలేని వస్తువు లెక్కడున్నాయి? అన్నిటికీ ప్రాణం ఉంది.

నాగ—ఏ మీసాహసం శాస్త్రీ! నీవుతినేవాటికి కూడా ప్రాణం ఉన్నాదంటావు కాబోలు?

గో—అనకేమి? ఢంకామీద దెబ్బకొట్టి మరీ అంటాను. ప్రాణం లేదని నీవనుకొనే వస్తువులేకాదూ నీకు రక్తంయిచ్చేవి?

నాగ—అవును.

గో—ఆ రక్తిమే కాదూ ప్రాణం?

నాగ— అవును.

గో—ప్రాణం లేనివి ప్రాణం ఎలాగివ్వగలవు? ఏమంటావు?

నాగ—బాగుంది నీవన్నది, చాలాబాగుంది! ఒకనిమిషం లో తేల్చేశావు. కాని, శాస్త్రీ ఆముఖము, ఆవిద్య, ఆవేదము, ఆ శాస్త్రము, ఆసంగీతము, అన్నీ ఉండి, ఆతుగ్రామం, సుందరమ్మపేటలో పరిచ్ఛన్నంగా ఉండాలని ఎలాగు తోచిందోయ్, నీకు? ఇర వై ఏళ్లవాడవు___

గో—ఇరవయి రెండు—

నాగ—ఈ పిన్నవయస్సులో, అన్ని ప్రజ్ఞలుండి, ఆసంతుష్టే మిటి?

గో—సాలుకి 40 వేలు వచ్చేవాడు నాకంటే ఎక్కువ తింటున్నాడా? తినగలడా? నీదయవల్ల అన్నీ పండేతోట. తోటలో ఇల్లు, స్వయంగా త్రివ్వకొన్న జలదుర్గమువంటి నుయ్యి, కామధేనువు వంటి ఆవు, రోజూ హావ్యంగ వీనము, నన్ను ప్రాణపదంగా చూచే ప్రాణపదమైన భార్య, గౌతమీతీరం, ఋషివాటికవంటి అగ్రహారం, నాకింకా ఏమి కావలెనోయ్?

నాగ—నీవంటి మహానీయుడు ఉండబట్టి, మాగ్రామంఋషి వాటికైనది.

గో—నానుంచికాదు. కృష్ణావధాని ఉండబట్టి. కాని, నాగ భూషణం, ఈమూట మాట ఇంట్లో చెప్పేవుసుమా! మన పని ఆ యాక, మళ్ల నారాయణసెట్టికి అప్పగించాలి. మూట ప్రాణంగా నేలమాన్యంలోఉంచిగదికితాళంవేసినాదగ్గిరుంచు.(నిష్క్రమించును)

నాగ—నాగుట్టూ మట్టూ శాస్త్రీకి అంతా తెలుసును. "40 వేలు వచ్చేవాడు నాకంటె ఎక్కువ తినగలడా?" అని నాపై ఎలా విసిరినాడో! నా రాబడి వాడికి ఎవరుచెప్పారో? అజ్ఞానం నాకు బా

ధించేటట్టు వినియోగ పరుస్తాడా? ఏమో, విఘ్నహృదయుడు! (నిష్క్రమించును)

## అయిదవ రంగము

నారాయణచెట్టి దుకాణం: ప్రవేశం-నారాయసెట్టి, రంగయ్య.

నా—రంగా, తిండికిపో.

రం—కాని, అయ్యా, అంత తొందరెందుకు?—

నా—ఎర్రిమొహమా, ఒంటిగంటైతే,తొందరేమి టంటా వేటి? ఎల్లు, ఎల్లు.

రంగ—దానిమాట కాదయ్యా, ఆశాత్తుల్ని పంపించావే, ఏమి—

నా—రంగా, అతగాణ్ణి చాలా అల్లరపెట్టావు. నాకు చాలాకోపం వచ్చిందిసుమా.

రం—ఏం ఉపద్రిoబచ్చిందని, నువ్వు—

నా—ఉపద్రింకాదటార్రి, నాగమ్మా? ఇంటికొచ్చిన బాప నాళ్లని పలానావారి అబ్బాయి అల్లరెట్టాడని అంతా అంటె?—

రం—అఁ హా! అంత అకస్మాత్తైన ఉపద్రిం ఏమొచ్చిందీ అంటాను-

నా—అతగా డెల్లిపోయినాడంటె, మనకొంప పోదురా?

రం—కాదయ్యా, ఉచ్చుకొన్నాడే! మరి—

నా—ఉచ్చుకోనీరా; మనకోసంగాని ఎట్టుకొన్నామా ఏటి?

రం—ఏటీ? అందరికీ ఇచ్చేడానికేనా? అంతా ధర్మానికే?—

నా—మరేటి? మా ఉచ్చుకొంటే, ఒక సేరుచ్చుకొనేను-

రం—సేరేటయ్యా? నువ్వుగాని తూచినావేటి అయన్ని?—

నా—తూసడంఏట్రా, ఎర్రిబాగులోడా? ఇంకాతాగనియ్యరా-

రం_తాగడమా?

నా—దాహం ఏస్తే, మరేట్రాచేస్తారు, తాకా? పాపం ఎంత దాహంతో ఒచ్చాడోగాని?

రం_దాహమా?

నాగ—అవును, దాహం-తాగడం-మజ్జిక తేట—

రం._అయ్యా, ఏటి అవంతా? నాకేమి బోధపడకుండాఉంది-

నా—దాగాని కొచ్చినవాడ్ని అల్లరెట్టి, పైపెచ్చు ఈ మాట లేటిరా? తెలిగేసి-పలవరిస్తున్నావురా? అన్నిగూనల్లోయీ తాగేస్తేమాత్రం? తాగనీ-

రం—గూనలేటి? బాపనాడేటి? తాగడం ఏటి? ఏటీసోదా!

నా—గూనలంటె గూనలు-తాగడమంటే తాగడం-గుద్దులంటే గుద్దులు-నీకేం కావాలేటి?

రం—ఆహా! ఇంకాగూనలే అంటాడూ! ఏం గూనలయ్యా?

నా—మరేటనమంటావురా, గూనలకీ? పెద్దకుండలనమంటావేటి?

రం—నువ్వుగాని, గూనలేమైనా భోషాణంలో ఎట్టావేటి?

నా—ఏగాడిద చెప్పాడ్రా, ఎట్టానని?

రం—ఎవడైనా, ముత్యాలూ, రత్నాలూ, తాగుతాడయ్యా?—

నా—ఎవడన్నాడ్రా?

రం—తరువాత? ఆ దొంగలేరీ? మనింటికి మాపిటి కొస్తారని ఆడికేం తెలుసును? నువ్వేలాగు నమ్మావయ్యా?

నా—దొంగలేట్రా? ఒరే నీకు దెయ్యం పట్టింది సుమా. 18 ఏళ్లోడవు, దాహానికి బాపనాళ్లొస్తే ఏం చెయ్యాలో తెలియదురా నీకు?

రం—తెలియకేమి?

నా—మరి అతగాను మజ్జిక తేటిమ్మంటే. ఆరాలుగాయతనమేమిరా?

రం—నన్నడగరేం?

నా—ఛీ, నోరుమూయి! నాదగ్గిరకూడా పెంకెతనమేనా? ఊఁ!

రం—ఇదేటయ్యోయ్; నీదగ్గిర ఏగాడిద పెంకెతనం చేశాడు?

నా—లేకుంటె, ఆమాటలేటా?—కాని, రంగా, నీమెళ్లోవ జ్రాల మాలేది? బరువైపోయిందేటి ఈయాల?

రం—మన భోషానికి రత్నాలూ బరువులేదు; నాకు మాలా బరువుకాలేదు.

నా—మళ్లీ అలాగే మాట్లాడుతాడూ!—ఒరే, నీకేదో దెయ్యం పట్టిందిరా! నీమెళ్లో వజ్రాల మాలేదిరా?

రం—ఆశాత్తుర్లకి ఇచ్చేశాను---

నా—ఏశాత్తుర్లురా?

రం—నువ్వు నాదగ్గిరికి పంపిన ఆనల్ల బొమ్మడికి—

నా—ఆడికేలిచ్చావురా?

రం—ఒ గ్గిత్తకీ; దొంగలెత్తుక పోకుండా—

నా—ఆఁ!

రం— ఆచ్చర్య మెందుకు? ఆ నోరెల్ల పెట్టడం, ఆ రట్టొచ్చడం, ఆ కల్లెర్రిసెయ్యడం—ఎందుకయ్యా, అదంతా, ఆడ్ని నిహాస్యంగా అన్నీ పుచ్చుకొమ్మని నాకాడికి పంపించి?

నా—రహస్యమటా? రంగా, రంగా, ఒద్దుసుమా నాతో అల్లర? ఏం సెయ్యుమని పంపినానా?

రం—అప్పుడే పరాకా?

నా—నేను చెప్పింది, నాకేంజ్ఞాపకం ఉంటుందిరా?

రం—ఉండు. ఆడు నీదగ్గిరనుంచి నాకాడికివచ్చి—

నా—మజ్జిక తేట అడిగినాడు—

రం—లేదు. నన్ను చెప్పనిస్తావా? చెప్పనియ్యవా? నాదగ్గిర కూకోని, “రంగయ్యా, ఉళ్లోదొంగలు పడ్డరూ”—

నా—ఆఁ!

రం—"అరికాలుకిగ్రింద కన్నం వేసేవాళ్లుసుమా"

నా—ఆఁ! ఆఁ!

రం—"ఈరాత్రి మీాయింటికి తాళం పడతారూ"—

నా—అయ్యో! అయ్యో! ఆఁ! చెప్పు, చెప్పు—

రం—"భోషాణంలోని సరుకంతా మీా అయ్య నాచేతి కిచ్చేమన్నాడు. మాయింట్లో జాగ్రత్త చేయుమన్నాడూ"—

నా—అయ్యో! ఆడ్ని మరిడి ఇరుసుకోతినేనూ! అంటే, ఓరి కుక్కా, ఓరిదున్నపోతా, ఒరి పందీ, నువ్వేలాగు నమ్మావురా?—

రం—నమ్మలేదే—

నా—మరెందు కిచ్చేశావురా, నీతలకాయ పగలా?—

రం—నేనియ్యనన్నాను. అంటే, దువారంకాడికెల్లి, నిన్ను గట్టిగా పిలిచాడు—

నా—అవును. పిలిశి, నువ్వు తేటిచ్చావుకావన్నాడు—

రం—తే టనలేదు—

నా—అన్నాడు-

రం—లేదు-

నా—అన్నాడు.

రం—లేదు, లేదు, లేదు.

నా—అన్నాడు—అన్నాడు—అన్నాడు.

రం—లేదు, నీమీాదబట్టు, అమ్మోరు పాదాలమీాదబట్టు. నన్ను చెప్పనివ్వవాపటి? ఆ బాపనోడికంటె, నువ్వే ఉపముగ్రిడులాగు న్నావు! "మీాఅబ్బాయి ఇవ్వనంటున్నాడు. ఇదిగో, ఎల్లిపోతున్నా న"ంటే, ఒరే, రంగా, గాడిదా, కొంపతీస్తావటార్రి? తానం మానేశి చ్చియ్యాలా? లేకుంటె ఆతనుచ్చుకొన్నంత ఇస్తావా? అని నువ్వ లేదా?

నా—అంటే, రత్నాలూ, ముత్యాలూ, ఇచ్చేయమన్నానురా? ఓరి బూతమా, ఓరి చండాలుడా, నేను, నేను—

రం—నన్ను కొట్టకు. ఆడు చెప్పిందీ, నువ్వు చెప్పిందీ కలుస్తే మరేటర్థం?

నా—ఉచ్చుకోవడం అంటే, తాగడంరా నాఅర్థం, నాయనా!

రం—"కొంపతీస్తానట్రా—"

నా—ఓరి పిశాచమా, దాహానికొచ్చిన బాపనయ్యను దాహంఇయ్యకుండా పంపించేస్తే, పాపంకాదురా? శెడిపోమ్రా? అదిరా నాఅర్థం, కొట్టు ఈపిశాచానికేల అప్పగించాన్రా, దైవమా? ఈ గాడిదెకు, ఈ దున్నపోతుకు, ఈ, ఈ, ఈ, ఊఁ, ఊ, ఈ-

రం—నాతప్పేంలేదు, నన్ను కొట్టావంటే చూసుకో—

నా—మరి నాతప్పట్రా? పెట్టెడుసరుకు ఇచ్చేశి, నాతప్పట్రా?

రం—ఏమో—

నా—"ఏమో?" ఆఁ! "ఏమో"వా? చూసుకో—చూ—చూ—చూ—హుమ్!—ఉమ్!—

రం—మళ్ల కర్రిస్తుతున్నావు. కొడితే, ఇంట్లోనుంచి పోతాను-

నా—నేనూ పోతాను. నువ్వోఊళ్లో అడుక్కో; నేనోఊళ్లో అడుక్కొంటాను. మరింట్లోఏముంది? బంగారం ప్రియమైనదని వెయ్యితులాలబంగారం అమ్మేశి, ముత్యాలమీద ఎట్టినాన్రా నాయినా! అంతా పోయిందా, తండ్రీ! సూస్తూంటే, నాకోటిరూపాయిల సరుకూ ఎగిరిపోయినాదిరా, రామయ్యా! (మూర్ఛిల్లును) తెర.

# ద్వితీయాంకము.

## మొదటిరంగం

రాజధానిలో ఒక వీధి. ప్రవేశము, చెంగల్రావునాయుడు, అప్పలస్వామి, మరిముగ్గురు పోలీసువాళ్లు; ఒక గదిగుమ్మంలో నిల్చున్న ఒకస్త్రీ.

చె—(తనలో) అక్కడ గుమ్మంలో నిల్చున్న అప్సరస ఎవ్వరైయుండునో? నన్ను చూడగనే, తలుపుతీసుంచి గదిలోకి ఎందుకు వెళ్లినది? అరే అక్కడ నిల్చొని నావైపు ఆ చూడడమేమిటి? చిరునవ్వుకూడానా? సరే, బోధపడ్డది. నన్నులోనికి రమ్మని పిలవడం అన్నమాటే! నాకోసం కనిపెట్టుకొని ఉన్నట్టున్నది. అవును, దానికి సందేహమేమిా? లోపలికి వెళతాను—వెళ్లనా?—వెళ్లవచ్చునా? వెళ్లిచూస్తాను. కోపగిస్తే, దాహాని కొచ్చానంటాను, కోపగించకుంటే, ఆమనిషి నాదే! ఆ అప్సరస నాదే! ఆ అసమాన సుందరి నాదే, —ఇంకా నిల్చునే యున్నది!—అప్పలస్వామిా, మిా నలుగురు జమాన్లూ ఇక్కడే ఉండండి; నేను వెళ్లి ఇప్పుడేవస్తాను. (లోనికివెళ్లి ఆ యాడమనిషికి ఎదురుగా నిల్చొనును.)

అ—చిత్తం, బాబూ. (తనలో) నాయుడుగారికి మరి ఉద్యోగం నీళ్లధారే! ఏం అంటావు పైడయ్యా?

పై—ఆనల్ల బాపనోణ్ణి పట్టుకొనేదాకా మరొకపనిలేదని సర్కారువారి శలవు. నాయుడుగార్ని ఈ మనిషి పట్టుకొంది. మరిపైకి వచ్చేదెక్కడ? తెల్లవార్లూ మనం నిల్చొని సవ్వాలి. పిలిచేసరికి పలుక్కుంటే మన నౌఖరీలు సున్న. ఆ అరుగుమిాద కూకుంటే? ఏం బంగారీ?

బం—బాగుంది; పదండి. (నలుగురూ నిష్క్రమింతురు)

స్త్రీ—ఏం, చెంగల్రావు నాయుడుగారూ, చాలాసేపు నావైపు వెర్రివాడిలాగు చూస్తూ నిలబడ్డారు. నేనెవరినో పోలిక తగిలిందా?

నియందు ఏనాడు ఏపురుషుడు ప్రేమ చూపించినాడు? మా అక్క కు ఎన్నో తెలుసునుగాని, ఆ ముక్కమాత్రం తెలిసిందికాదు-ఎప్పు డన్నా, మా నాయుడుగారనే అనేది. ఎప్పుడైనా మిమ్ముల్ను సా ధించిందా? అది మీడబ్బుచూచి మిమ్ముల్ను చేరలేదు. తనడబ్బే మీకు పెట్టేది. ఒకమాటు ఏదో కేసులో మీకు పెద్ద చిక్కువస్తే తన మెళ్లోది తాకట్టుపెట్టి మీ అవసరం గడిపింది.

చెం—అవును పాపం, జ్ఞాపకం ఉంది.

స్త్రీ—ఆ మనిషే జ్ఞాపకంలేనప్పుడు ఆ మాటలేలాగు జ్ఞాప కం ఉంటుంది? మీరిచ్చిన జాబితాలో ఉండడానికైనా నోచుకోంది కాదు. ఎవరో మధురం, కావేరీ, వాళ్లూ వీళ్లూ జ్ఞాపకం వచ్చారు గాని, దాని ఊసేలేదు! ఇంతకూ మిమ్ముల్ని అనే పని ఏముంది?

చెం—హీరా, నిజంగా నాకు చాలావిచారంగా ఉన్నది.

స్త్రీ—ఇంతంత విచారంకాదు. ఏమైనా, దాని ఆత్మసంతో షిస్తుందని, మిమ్మల్ని చూతామనే ఇంతదూరం వచ్చినాను. లేకుం టే, నాకు ఎవరి ఆసరా అవసరంలేదు. నాసంగీతంవల్ల నాఅయిదు వే ళ్లూ నోటిలోకి వెళతాయి. మన ప్రభువువారికి, మహారాణీ ఇంది రాదేవి వారికీ, గిరిజా దేవివారికి సంగీతం అంటే ఎంతో ప్రీతి. ఆభ రవసాచాలును. కాని, మా అక్కయ్య చక్కదనమే మీదుష్టికి అగ పడనప్పుడు, దాని కాలిగోరుని పోలనిదానను నేననగా ఎంత?

చెం—నీ కాలిగోరునే అది పోలదు. నీదగ్గిర ఎవర్తె నిలబడ గలదు?

స్త్రీ—ఇన్స్పెక్టరు హోదారాగానే, మీరాదరించిన సూ ర్య కాంతంకూడానా?

చెం—ఎందుకెత్తిపొడుస్తావు,హీరా? నీకూ నాయందు అంత ప్రేముండడం, నాఅదృష్ట మేమని చెప్పను?

స్త్రీ—మా అక్కయ్య ఆత్మతరించినది. (కళ్లుతుడుచుకొనును). మా కులంవాళ్లకున్న గడుసుతనం నాకేమీ లేదని తంజావూరు తీ

సుకో వెళ్లి సంగీతం చెప్పించి, కడతేరా నేను విద్య చెప్పుకొనేవర
కూ ఉండరాదూ? కాని, ఈరాత్రి ఇక్కడ అట్టే ఉంటారా?

చెం__నాకు ఉద్యోగసంబంధమైనది, అతితొందరగపని ఉన్నది.

స్త్రీ__అయ్యో, ఉండరా? సూర్యకాంతం దగ్గరేనా?

చెం—నారాయణ__

స్త్రీ__ఆహాఁ నారాయణ దగ్గిరా?

చెం—అక్కడా కాదు. ఈ మధ్యాహ్నం రెండుఝాముల వేళ,
వర్తక చక్రవర్తిని ఒకడ్ని ఒకబ్రాహ్మడు ఏమీలేకుండా చేసినాడు.
వాడ్నిపట్టుకోవలెను, లేకుంటే నా భవిష్యం పోతుంది.

స్త్రీ__నేను రాక రాక ఇక్కడికి రావడం, ఆదొంగతనం
మీరా దొంగను పట్టుకొందికి బయలు దేరడం, మా బాగుంది!

చెం—దొంగను పట్టుకొంటానని నాకు బాగా నమ్మకంఉన్నది.

స్త్రీ__మీశక్తి నాకు తెలియదూ? దొంగమీయెదుట ఉ
న్నాడన్న మాటే. ద్వారపూడి బందిపోటు కేసులో, అ మిన్నికూ
ని చేసినకేసులో, స్వాములవారు ఎవర్తెనో సంసారిని లేవకొట్టితీసు
కొనిపోయిన కేసులో, తరువాత, ఎవడూవాడూ?——ఆఁ రామిరెడ్డి
దొంగసంతకం కేసులో, మీరు చేసిన పని నేను ఎరుగనూ, నాకు
చిన్నతనం అయినా?

చెం—ఏమిజ్ఞాపకం నీది!

స్త్రీ__కాని ఈ కేసులో అంత తొందరెందుకూ? రేపువెళ్లి
తే మీ తలమీద పువ్వుతీసేవాడెవడు?

చెం__ఆవర్తకుడు, నారాయణసెట్టి, తిన్నగావెళ్లి ప్రభువ
వారితో గోలపెట్టాడు. ప్రభువువారు నన్ను పిలిపించి, "నాయుడూ,
ఆ దొంగను పట్టుకొన్నావంటే, ఏమయినాఉంది. లేకుంటే, నీపని
సరి" అని స్వయంగా శెలవిచ్చినారు. ఈ యాజ్ఞ, నాస్నేహితుడు,
దివానిచ్చియుంటే ఒక్క ఈ రాత్రికాదు, నెల్లాళ్లు నీ దగ్గిరే అట్టే
ఉందును, అన్నం యిక్కడికే తెప్పించుకొంటూ.

స్త్రీ—దివాను మీకంత స్నేహితుడా?

చెం— మా అక్కయ్యా మొదటిలో మా యిద్దరిదగ్గిరా ఉండేది. స్నేహం కలిస్తే అక్కడే కలియాలి. ఇప్పుడేటయింది-ఇప్పుడువెళ్లి, మళ్లీ రేపుదయం ఏడు వేసేసరికి ఇక్కడ హాజరు. మరినన్ను వెళ్లనీ-

స్త్రీ—నాకొక ఉపకారం చేస్తారనుకొన్నాను- పోనీలెండి, నూరు మొహరీలే కదా పోతాయి?

చెం—నూరు మొహరీలు పోవడం ఏమిటి?

స్త్రీ—కేశవరావు పంతులుగారట. ఆయన కుమారునికి ఇవాళ వర్ధంతట- వారింటిలో ఈరాత్రి నాపాట, నూరు మొహరీల కొప్పుకొన్నాను.

చెం—నీవెప్పుడొచ్చా వికడికి—

స్త్రీ—ఈ సాయంత్రం అయిదు గంటలకు.

చెం—అప్పుడే బేరం తగిలిందీ?

స్త్రీ—నేను ఊళ్లోకి వస్తూంటే, పంతులుగారు నన్ను బజారులో చూచినారు-నేనెవరి నని అడిగినారు-నేను సంగీత పాటకురాలనని చెప్పినాను. ఇక్కడ నీకెవరైనా చుట్టాలున్నారా అని అడిగారు- మా పెత్తల్లికూతురు, కావేరని చెప్పినాను-"ఏమిటీ, నాకావేరి నీకు అంతదగ్గిర చుట్టమా? నీ చక్కదనంలో పదోవంతు దానికుంటె బాగుండు"నన్నారు.

చెం—నిజంగా, నీముందర అది మాలకాకి- (తనలో) దీని మీద కన్నువేశాడు. లక్షాధికారి. వాడితో నేనెక్కడపోటీ తగలగలను? కాని, వాణ్ని చూచికూడా ఇదినాదగ్గిరకు వచ్చింది ఆతరువాత?

స్త్రీ—"నీపాట ఏమాత్రం?" అన్నారు. "తంజావూరిలో వైద్యనాథయ్యరు వారివద్ద విద్య చెప్పుకొన్నాను. ఇక్కడ పాటవల్ల జీవనం చేతామని వచ్చినాను." అన్నాను. "ఒకరాత్రి కచేరీకి ఏం పుచ్చుకొంటావ"న్నారు! "మూడుగంటల కచేరీకి నూరు మొహరీలకు

తక్కువ ఎప్పుడూ పుచ్చుకోలేదు- తంజావూరిలో కూడ నాకు ఆపద్దే"అన్నాను-"సరే,రెగంటల ప్రాంతమందు రావలసిన"దన్నారు.

చెం—తగినచోటనే విస్తరి వేసినావూ! ఇక నీపేరు రాజ్యమంతటా గుప్పుమంటుంది. అంతదానవు నన్ను వెతుక్కొంటూ రావడం నా అదృష్టమే అనాలి.

స్త్రీ—తమరలా అనడం నా అదృష్టం.

చెం—నీవు నన్నడగబోయేది చెప్పకోనా? నన్నువచ్చి నీ పాట వినమంటావు. అంతేనా?

స్త్రీ—వింటే చాలాసంతోషమే- ఇక్కడ అడుగుపెట్టగానే మీా బోణీ అయినట్టుంది. కాని, నా నగలన్నీ ఇల్లిక్కడే పోయినాయి. చేతికి మురుగులే ఉన్నాయి.

చెం—ఏమిటీ? నీవీ పోయినాయా? ఇల్లిక్కడే అంటున్నావు. ఎక్కడ? ఎప్పుడు?

స్త్రీ—మీారు చెప్పల్లో కాళ్లుపెట్టుకొని ఉంటే నే నేమి చెప్పేది?

చెం—అక్కర లేదు-టూకీగా చెప్పు-

స్త్రీ—మామునిలమ్మా, నేనూ ఈవూరు వస్తున్నాము. ఊరు రెండు మైళ్లుండగా నేను ఒక తుప్పచాటున కూర్చుండవలసి వచ్చింది-అప్పుడు ముగ్గురు మనుష్యులు బండీలోకి వెళ్లి నా పెట్టె పట్టుకొని దిగినారు. పాపం మా ముసిలమ్మను జుట్టుపట్టుకొని కిందికి యీడ్చి వేసినారు. ఏమయిందో—

చెం—ఆ మనుష్యుల చహరా చెప్పగలవూ?

స్త్రీ—అందులో ఒకడు పొడవుగా ఉంటాడు. మరొకడికి గరిమీాసాలు, పెద్దమీాసాలు ఉంటాయి-మూడవవాడు నల్లగాఉంటాడు

చెం—ఏమాత్రం పొడువుంటాడు?

స్త్రీ—ఎవడు?

చెం—నల్లటివాడు?

స్త్రీ—నాఅంత ఉండవచ్చును.

చెం—జ్ఞాపకం ఉన్నంత మట్టుకు వాణ్ణిగురించి చెప్పూ-

స్త్రీ—పోతూ పోతూన్నవిభూతి పిండికట్లున్నాయి- శాలువ కప్పుకొన్నాడు-

చెం—శాలువ రంగు?

స్త్రీ—ఆకుపచ్చది. కట్టుదిట్టమైనవాడు-బ్రాహ్మడో, కంసాలో, చెప్పలేను-చేతిలో చిన్న పెట్టెఉన్నది.

చెం—దాని రంగు?

స్త్రీ—తెల్లటిది-

చెం—నీదా?

స్త్రీ—కాదు-నాది కర్రది.

చెం—(ఆలోచిస్తూ) ఇవన్నీచూస్తే, మధ్యాన్నం మనిషిలాగే కనిపిస్తున్నాడు, ఆవిభూతి, పచ్చశాలూ, దంతప్పెట్టె, వాడిరంగూ చాలా నల్లటివాడా, హీరా?

స్త్రీ—అంతనలుపు నే నెక్కడా చూపులేదు- ఎండలో నిల్చుంటే చీకటైపోతుంది-

చెం—ఆఁ వాడే! వాడే! పెట్టెవన్నీ దంతప్పెట్టెలే-తరవాత?

స్త్రీ—ఆమనుష్యులు వెళ్లాక, ప్రాణాలు పిడికెట్లో పెట్టుకొని, తుప్పలచాటుని మెల్లిగా మహారాజావారి తోటచేరాను' పట్నంచేరాను మరిభయంలేదనుకొన్నాను-కాని ఆనల్లదెయ్యం మళ్లహాజరు!

చెం—ఎక్కడ?

స్త్రీ—తోటదేవిడీకి ఎదురుగా రావిచెట్టుకింద.

చెం—తోట బాగా చూచావా?

స్త్రీ—కొత్తతోట. మేము తంజావూరు వెళ్లేసరికి ఆ తోట లేదు. అంతాబట్టబయలే-ఇంకాచిన్నచెట్లు. "గోపీనాథ్‌విలాస్" అని తోటదేవిడిమీద పెద్దక్షరాలు చెక్కున్నాయి. దూరంగా మేడ పరంజాలు కనిపించాయి.

చెం—(తనలో) నిజంగాచూచింది-రావిచెట్టు తోటకు ఎంత

దూరంలో ఉన్నాది?

స్త్రీ—చూచినది ప్రతీది కొలవడానికి నేను పోలీసు ఇన్స్పె క్టర్ను కాను. ఆ దొంగ ఛాతీ ఎన్ని అంగుళాలుంటుందని అడుగుతారు కాబోలు? నాకు తెలియదు.

చెం—మరేమైనా కనిపెట్టావా?

స్త్రీ—వాణ్ణి చూసేసరికి, నా కాళ్లు వణుకుతూంటే, ఏం కనిపె ట్టేది, నా నెత్తి?

చెం—ఇక్కడికి వచ్చే తోవలో?

స్త్రీ—బజారులో మామిడిపళ్ల రాసులు కనిపించాయి.

చెం—హాస్యానికి వేళాయిది, హీరా? నల్లవాడు ఒక్కడే ఉన్నాడా?

స్త్రీ—దగ్గిరెవ్వరూ లేరుగాని, కొత్త గ్రహారం రోడ్డులో మా త్రం ఒకడు వానివైపు చూస్తూ నిల్చున్నాడు—

చెం—బాస్, దొరికాడు! కొత్తగ్రహారం ఉన్న పాళంగా పరి గెత్తాలి. వాడిప్పుడు అక్కడే ఉంటాడు, మామంచి ఆచోకీ యిచ్చా వు. వాడి జాడ పట్టడానికి 50 మంది జమాన్లు వెళ్లారు. ఇంకా ఒకే మూ రా లేదు—రేపుదయం 7 గంటలకు నీ నగలు పట్టుకొని నీదగ్గిరకి వచ్చి తీరుతాను—ఇప్పుడు—

స్త్రీ—మా ముసిలిది ఏమయిందో కూడా కనుక్కొని నా కళ్ల పెట్టరూ? నగలు మళ్లీ వస్తాయిగాని! ముసిల్ది ఏలాగొస్తుంది?

చెం—మరేం భయం లేదు. నగలువస్తే ముసిల్ది వస్తుంది—కాని, నీకేదో కావాలన్నావు—టూకీగా చెప్పు—

స్త్రీ—తమకంత తొందరగా ఉన్నప్పుడు ఏలాగడిగేది? 100 మొహరీలేక బాపోతాయి? మరోనాడా యేను.

చెం—నగలు ఏమీ వంటిని లేకుండా ఎలాగు వెళ్లడమని అనుమానిస్తున్నావు కాదూ?

స్త్రీ—మనస్సులో మాట అలాగు పోల్చాలి. నేరం పట్టడంలో

ఇంత గొప్పవారంటే మరివింతేమిటి? మెళ్లో జిగినీ—

చెం—సరే. నేనుండగానీకు నగలకేమిలోపం? అప్పలస్వామీ,

అప్పల—(ప్రవేశించును) చిత్తం!

చెం—మా యింటికి పరుగెత్తి, మాఆడంగులనడిగి నగలన్నీ తీసుకోరా—"ఎవరో పెళ్లికెళుతున్నారూ, రేపుదయమే ఇచ్చివేస్తారూ" అని చెప్పు—ఉండుండు-నే నిక్కడున్నానని చెప్పేవు సుమా? ఇది పెళ్లిళ్లకాలం నమ్ముతారు-పో పరుగెత్తు.

అప్పల—చిత్తం, బాబూ (నిష్క్రమించును)

స్త్రీ—పోనిస్తురో, నాయుడుగారూ-మీరంతతొందరలోనుండి-

చెం—అయితేనేమి? ఈవీధినే మాయిల్లు.

స్త్రీ—ఏమోఅనుకొన్నాను, నిజంగా తమకు నాయందు ప్రేమున్నదే! నానగలిచ్చి మీనగలు తీసుకొంటారు-అంతేనా?(నవ్వును) కాని, నగల మాటకేమి, మళ్లీ సంపాదించు కొంటానుగాని, బంగారు పతకాలుమట్టుకు ఎలాగైనా రాబట్టండి-

చెం—ఎన్ని?

స్త్రీ— 4 మధురలో ఇచ్చినవి; 6 తంజావూరులో; 2 కంచి గరుడ సేవలో! 3 తెనాలిలో—కాదు, కాదు 4! 2 శ్రీరంగంలోవి; 1 విజయ వాటిక కనకదుర్గ ఉత్సవములో—అన్నీ 19.

చెం—అన్ని సంపాదించావూ?

స్త్రీ—చిత్తం-తంజావూరు పతకాలు ఆరూ నాకు అన్నిటికంటె ఎక్కువ ప్రీతి-

చెం—ఎక్కువ పనివాడితనమున్నదనా? లేక వాటిలోరత్నాలున్నాయనా?

స్త్రీ—మాగురువుగారు (నొసట చేతులు జోడించును) గొప్ప సభలలో పౌరులస్థానే వారిచేతితో స్వయంగా వాటిని నాచీరకు తగిలించి, "మరి ధరించుటకు స్థలములేకుండా అనేక పతకములు నీకు బహుమతి వచ్చుగాక!" అని దీవించినారు. అందుకు వాటి

యందు ఎక్కువప్రీతి—అదుగో అప్పలస్వామి! ఎంతలో వచ్చాడో వగరుస్తూ!

అప్పలస్వామి ప్రవేశించును.

అ—ఇదుగో, బాబూ, నగలపెట్టె.

చెం—మావాళ్లేమన్నారా?

అ—అన్నారూ, "నాయుడుగారుమళ్లీ వెనకటి తోవలో పడితే-

చెం—తనఇష్టంవచ్చినట్టు చేస్తానన్నారుకాదూ?

అ—చిత్తం—

చెం—దానికేం? అది వెనకటి బెదిరింత. కోయ్యాగూరకూ సిగ్గులేదూ, కొడవలికీ సిగ్గులేదూ. హీరా, ఇవిగో నగలు. నేనువెళ్లాలి. అప్పలస్వామీ, కాని వజ్రపుటుంగరాలేవీ-- అల్లాపెద్దకేసులో దొరికినవీ?

అ—అవి ఎవరికీ ఇవ్వనన్నారు.

చెం—హీరా, నువ్వు తంబూరా మీటుతున్నప్పుడు అవి నీ వేళ్లనుంటే, కళ్లు జిగాల్మంటూ ఉండును. మరివెళతా.

స్త్రీ— రేపుదయం ఏడుగంటలకి తప్పదుసుమండీ!

చెం—లేకుంటే, నన్నెప్పుడూ నమ్మకు (చెరొకవైపు నిష్క్రి))

రెండవరంగం

దివాన్ఇల్లు-ప్రవేశం, దివాన్, గోపాలశాస్త్రి.

నా—గోపాలశాస్త్రీ! చెంగల్రావు నాయుడుగురించి నీకు నే చెప్పినదంతా ఎంతసొగసుగా వినివోగవచ్చినావు! అంతవేగం బుట్టలోవేసి నగలన్నీ తెచ్చావు. ఎంతసొగసుగా కనిపించావోగాని! మోహినన్నపేరు సార్థకం చేసుంటావు. నీ ఆడవేషం చూడాలనని ఉన్నది.

గో—నీ భార్యా శెలవు పుచ్చుకో, మళ్లీ ఆడవేషం వేస్తాను.

నా—ఒకవేళ నాయుడు ఈరాత్రి నీదగ్గర అట్టే ఉంటాడను కో. దానికేమెర్పాట్లు చేశావు?

గో— ఏ యేర్పాట్లూచేయకుండా, ఈ పాట్లుపడతానా? రెండు పిడతలలో పాలు జాగ్రత్త చేసి ఉంచాను. ఒక్కదానిలో గం జాయి, నాభి మొదలగునవి కలిపిఉంచాను. అది తాగమంటాను.

నా—వాడు తాగనంటే?

గో—నీవువిట్లో ఆరితేరినవాడవు, నీవూ ఆలాగనడమేనా? పాలు తాగమని నేను అనడం, తాగననడమున్నా? గుండెలా? చెరు వా? "ఈ విషం తాగండీ, నాయుడుగారూ" అన్నా, తాగితీరాలి. ఆపాలు కంఠం దిగడమేమిటి, నాయుడుగారు నేల పాలు కావడమే మిటి? సూదితో పొడచినా, తేలుకుట్టినా, మరి తెలివిరాకుండా? అప్పు డు గుడ్సంలోకి వచ్చి కొత్తగ్రిహారందగ్గిర రావిచెట్టుకింద ఉండ మని నాయుడుగారి శెలవైనదని జమాన్లను పంపించివేసి ఉందును.

నా—అయితే నగలు లేకుండా ఇంటికి వచ్చి ఉందువు?

గో—కావాలంటే, దొరక్కేమి? "అప్పలస్వామీ, నాయు డుగారు ఇంటికి వెళ్లి నగలు తెమ్మన్నారంటే, తేకేమిచేస్తాడు? నా యుడు ఈ లోకంలో లేడని జమాన్లకేమి తెలుస్తుంది? అయితే వా టియజమాని చేతులార యివ్వాలి, నేను పుచ్చుకోవ లి గాని, వాడికి తెలియకుండా పుచ్చుకోవడం, నాపద్ధతికి విరుద్ధం.

నా—బలే, శాస్త్రీ! కాని నగలేమాత్రం ఉంటాయి?

గో—ఒక్క కాసులపేరే ఉంటుంది 70-80 తులాలు. నగ లన్నీ పదివేలకు తక్కువ ఉండకూడదు.

నా—శాస్త్రీ, చాలా తమాషా చేసినావే, కేశవరావు కొ డుక్కి వర్ధంతనిచెప్పి అది దసరాలో అని నాకు తెలుసును కాని, నాయుడు రేపు ఏమిచేస్తాడనుకొంటావు?

గో—పొద్దున్నే లేస్తాడు, భోజనంచేసి నాదగ్గిరకు వెళతా

డు, అక్కడ ఎవరూ లేకపోవడంచూచి నన్ను కేశవరావు ఉంచే శాడనుకొని వారింటికి త్రోవలో ఏముందో చూచుకోకుండా పరిగె త్తాడు. "నన్ను పాటకి పిలిచావ్రకావు కే!" అని నాయుడంటా, "పా టేమిటి? పిలవడమేమిటి"ని కేశవరావు—చాలాతమాషాగా ఉం టుంపాకాస్తాట-నేను వెళ్లిచూడాలి అనుంటా-(నిష్క్రమించును)

# తృతీయాంకము

## మొదటి రంగం

కోత్వాలుఇల్లు. ప్రవేశము. శ్యామలరావు, వెంకుబాయమ్మ.

వెంకు—నాన్నగారూ, 11 గంటలకు ముందు ఎన్నడూ భోజనంచే యనివారు, ఇప్పుడేమి సాయంత్రం 7 గంటలకే భోజనంచేసినారు.

శ్యా—వెంకుబాయమ్మా, నీవెప్పుడూ గదిలో ఏదో చదువుకొం టూ కూర్చుంటావు, పొరిగింట భాగవతాలయినా తెలియవు-నిన్నజ రిగిన ఘోరాలగురించి విన్నావుగద? చెంగల్రావు కొత్తగ్రహారం లో నల్లగాఉన్న బ్రాహ్మణుల నందరినీ పట్టుకొని చావకొట్టాడు. ఈ ఉదయమే కేశవరావింటికివెళ్లి అతన్ని అన్యాయమైన మాటలూ ఆడాడు. తరువాత అతనుంచుకొన్న మనిషిని, కావేరిని పట్టుకొని ఉ తికేశాడు-వళ్లంతా తట్టి—

వెం—దాన్నెందుకు కొట్టాలీ?

శ్యా—ఎవర్తో అతని నగలన్నీ టోపీవేసింది. వాళ్లిద్దరూ చుట్టాలని ఆ మనిషిని కళ్లె పెట్టుమన్నాడు. అది "మొర్రో నాకెవరూ చుట్టా లేరంద"ట-అది నమ్మక దాన్ని చేతికర్రతో చావచంపి చెవులు మూశాడు. వాళ్లందరూ ప్రభువు వారితో వెంటనే ఫిర్యాదు చే స్తే, నాయుడుచేత వాళ్లందరికీ గుణహా యిప్పించారు.2000 మొ

హాకీలు కూడాయి-అప్పుడు నన్ను పిలిపించివాళ్లిద్దర్ని పట్టుకొంటే, గొ
ప్ప బహుమతీ యిస్తారని ప్రభువువారు స్వయంగా శెలవిచ్చారు.
"శ్యామలారావు పంతులుగారూ, మీరుకూడా నాయుడుబాగు మో
సపోయేరుసుమా!" అని నవ్వారు. భోజనం అయింది, అది ఒక్క
టే చేతనైనపని. ఎక్కడికో, ఏమిచేయడానికో తెలియకుండా, ఇక
బయలుదేరాలి.

వెం—మీరు నాయుడ్ని కలుసుకోలేకపోయారూ?

శ్యా—ఆరువేసేవరకూ ప్రయత్నించాను-ఇంటివద్దలేడు, కచేరీలో
నూ లేడు: ఊరంతా వెతికించాను, కనబడలేదు. ప్రయత్నం—
ఉండూ! ఏవరో తలుపుకొడుతున్నారు! ఎవరాతలుపు? పున్నయ్యా,
తలుపు తీయకుండా అడుగూ-

(గుమ్మంవద్ద రాఘవరావు ప్రవేశించును)

రా—తలుపుతీయకుంటే, మా జగదాంబ పిన్నిగారింటికి పోతాను-
ఆవిడా తలుపు తీయకుంటే, మళ్లీ కాశీ ఏమవుతుంది? నే నేమవు
తాను?

శ్యా—రాఘవరావుకాడూ? జగదాంబపిన్నీ, కాశీ—వాడే! (తలు
పుదగ్గరకివెళ్లి) ఎవరది?

రా—మీరు మా మామగారు, శ్యామలారావు పంతులుగారైతే
నేను మీ అల్లుడు, రాఘవరావును.

శ్యా—ఏమిటీ, మా అల్లుడు రాఘవరావా?

రా—ఒకటే, మీరు కొత్వాల్ శ్యామలారావుపంతులుగారు కారు.
లేకుంటే, మీ అల్లుని పేరు మరిచిపోయినారు. నేను వెళ్లి 6 ఏళ్లుఅ
యాక ఇంకా జ్ఞాపకం ఉంటుందా?

శ్యా—నేను కొత్వాల్ శ్రామలారావునే; మా అల్లుడుపేరు రాఘ
వరావే. అయితే, నీవేనా రాఘవరావువు?

రా—ఆప్రశ్నేమిటి? నాకేమి బోధపడదు. స్వర్గస్థులైన సీతారామ
చంద్రుడు పంతులుగారి పెద్దకుమారుడ్ని- మా

అమ్మపేరు నరసమ్మ-అవిడ మీ అక్కయ్య. జగదాంబ మీ చెల్లెలు.
మీ నాన్నగారు కోటేశ్వరరావు. పంతులుగారు 10 ఏళ్లక్రింద పోయినా
రు. మీ అమ్మ వెంకుబాయమ్మ. అవిడ పేరింటిదేగా, మీ ఒక్కతె
మూర్తి-పెళ్లిలో 6 ఏళ్ల క్రిందట తలుపువేసి నాచేత మీ పిల్లపేరు
చెప్పించారు-ఈనాడు మళ్లీ మీరు చెప్పిస్తున్నారు. పెళ్లినాటికి నేను
19 ఏళ్లవాడను. మీ పిల్ల 12 ఏళ్లది-మా అత్తగారిపేరు వేణమ్మ
మా జన్మస్థానం అంగర, నేను మీ అల్లుడనేనా? కాకుంటే, ఇటు
పైని మా ఊరు అంగరా కాదు, రాజమహేంద్రవరమూ కాదు, కాశీ.
శ్యా—(తనలో) ఎంత పెంకెతనంగా మాట్లాడుతున్నాడో!—నీవ
టోయ్ బాబూ? (తలుపుతీసి) నీవేనటోయ్? ఇదిగో, వెంకుబాయ
మ్మ, కాశీనుంచి బాబువచ్చాడు. లోపలికిరావోయ్ తండ్రీ! ఒకసం
వత్సరము కోటేశ్వరస్వామికీ, భీమేశ్వరస్వామికీ, ప్రతిసోమవారం
అభిషేకాలు చేయిస్తాను. శంకరా, నీకటాక్షం వచ్చిందా, రక్షకా?
(వేణమ్మ ప్రవేశించును) ఇదిగో, బాబు, రాఘవరావు, విశ్వేశ్వరు
ని కటాక్షంవల్ల, మాతాన్నపూర్ణకటాక్షంవల్ల, మళ్లీ మన కళ్లప
డ్డాడు!
వే—బాబూ, మాయిల్లు చీకటిపోగొట్టడానికి వచ్చావోయ్? ఉ
త్సవంతో గంగిపాడుకో వద్దుము, ముందుగా ఏల తెలియజేశావు
కావూ?
రా—ఎవరిచేత కబురు పంపించేది, అత్తయ్యా?
వెం— గదిలోనుంచి తొంగిజూస్తూ) ఆయన కాశీపారిపోయిన ఈ
ఆరేళ్లూ నేను పార్వతిని ధ్యానంచేయడం వట్టినే ఎందుకు పోతుంది?
వే—బాబూ, చాలాఆయాసపడి వచ్చావు-మడికట్టుకో-మీ మా
మగారు ఇప్పుడిప్పుడే భోంచేశారు
రా—సూర్యాస్తమయ కాలంలో, నారాయణ సాగరంలో స్నా
నం చేసుకొని, సంధ్యవార్చుకొని, రొట్టెలు తిన్నాను. తడిగుడ్డయిం
కా కాశీకావిడీమీద ఆరుతునే ఉంది.

శ్యా—ఇక్కడున్నప్పుడు నీకు నీగోత్రమే తెలిసిందికాదు. కాశీలో నేర్చుకొన్నావా?

రా—అనంతరం కూడాను-విద్యాసాగర్ గారిపతి శాస్త్రిగారివద్ద వేదము, వేదాంగములు చెప్పుకొన్నాను.

శ్యా—సావకాశంగా కూర్చొని నీ వేదములంతా వినాలి.

వెం—(తనలో) పెద్దపండితులై వచ్చారు నాయిన్నాళ్లవస్థ మరిచి పోవచ్చును.(దాసీతో) వెంకీ, నీవేమి నాతలదువ్వుకు-నన్నిలాఉండనీ.

దాసీ—బాబొచ్చినాడని చింకిరితల దువ్వుతూంటే, కసురుతా వేంటమ్మా?

రా—నేను పెరట్లోకివెళ్లి కాళ్లుకడుక్కొని వస్తాను

శ్యా—పున్నయ్యా, బాబుని నూతిదగ్గిరకి తీసుకోవెళ్లి కాళ్లకి నీళ్లియ్యి. లాంతరు వేగం వెలిగించు-(రాఘవరావువెళ్లి తిరిగివచ్చును)

వెం—పున్నయ్యా, ఇదిగో తువాలు-

రా:—మా రామయ్య పెద్దనాన్న కులాసాగా ఉన్నారా?

శ్యా:—పోయి నాలుగేళ్లయింది.

వెం.—అయితే క్కండీ, నాన్నగారూ; మనము వలసలో భూములు కొన్న 3 నెలలకు.

రా:—పోయేరా! మా నాన్నగారు పోయాక నన్ను ఎంత ప్రేమగా పెంచారు!

వే:—ఏడవకమ్మా, ఏడవకు.

రా:—పేరమ్మ కులాసాగా ఉందా? దాన్ని మా ముద్దుగా పెంచారు. నేను కాశీ వెళ్లేసరికి 10 యేళ్లది. నాకే ఇస్తామన్నారు.

వే:—వాడికే ఇచ్చారు. దాని కో కొడుకు పనసపండులాంటివాడు.

రా:—అలాగా? వెళ్లి చూడాలి. పల్లయ్య చింతాత బాగున్నారా?

శ్యా:—70 యేళ్లవాడైనా, 40 యేళ్లవాడులా గున్నాడు.

రా:—కడియంలో కాపురముంటా ననేవాడు.

శ్యా:—అక్కడే ఉన్నాడు.

రా:—భావన్నారాయణెక్కడున్నాడు?

శ్యా:—పోయి రెండేళ్ళయింది.

రా:—ఆఁ! ఆఁ! పోయాడూ! ఫిరంగి గుండులాంటివాడు! ఆహా! నా కంటే 3 యేళ్ళే పెద్ద. భావన్నారాయణా, నీకు నూరేళ్ళూ నిండిపోయినాయూ? మేము అన్నదమ్ముల పిల్లలలా గుండలేదు. నన్ను చూస్తే పంచప్రాణాలూ పెట్టేవాడు. వాడి కొడుకు బాగున్నాడా? ముఖం తెల్లచూచ్చా—

వే:—మా బాగున్నాడు. మొన్ననే వడుగుచేశారు.

రా:—బాలమ్మ వాడ్ని తీసుకొని పుట్టింటికి వెళ్లిందికాబోలు? అమలాపురం వెళ్ళి చూడాలి వాడ్ని.

వే:—మా దగ్గరుండమని బ్రతిమాలాం. భర్తివాడ్ని వదలలేక సనేమిరా ఉండనన్నాది. పోనీ, వెంకుబాయమ్మకు కొడుకుడతాడు.

శ్యా:—బాబూ, గంగ తీసుకో వచ్చావా?

రా:—కావిడినిండా గంగే, రెండు చీరలుపట్టుకొచ్చాను. అత్తయ్యా ఇది మీకూ, యిది మీ పిల్లకూ, పొందూరులో కొన్నాను. నేత చీరలు. ఇదిగో మా తాన్నపూర్ణ కుంకుమ.

వే:—పొందూ రెక్కడా?

వెం:—విశాఖపట్నం జిల్లా అమ్మా.

వే:—వెంకుకి తెలియనదంటూ లేదు. బాబూ, నీవు వెళ్లినది మొదలు, దానికి వంటిపూటల భోజనం. అదైనా పేరుకి తినడమే. ఈ ఆరేళ్ళూ తలమీద దువ్వెన పెట్టనియ్యలేదు. ఆ చాపమీద పడక. శంకరశాస్త్రి వచ్చి రోజూ సంస్కృతం చెప్పడం. పొస్తమానం పుస్తకమే కాలక్షేపం. దానికి కొడుకు పుట్టితే, విశ్వేశ్వరుని పేరు. ఆడపిల్లయితే అన్నపూర్ణ పేరు.

శ్యా:—సరే. పుట్టబోయేవాళ్లకి అనక పేర్లుపెట్టొచ్చును కాని, నేను వెళ్లాలి, వేళయింది.

రా:—ఎక్కడికి వెళతారు, మామయ్యా?

శ్యా:—(తనలో) మొదటిలోనే ఏమి అపశకునం! వాడి చదువంతా ఏమైందో!

రా:—భోజనం అయాక బైటికి కెళ్లడం మీకు అలవాటులేదే. అలవాటు మార్చుకొన్నా రేమిటి?

శ్యా:—లేదు, బాబూ, ఒక్కరోజున రెండు విపరీతమయిన నేరాలు జరిగాయి.

రా:—ఎప్పుడు మామయ్యా?

శ్యా:—నిన్న మధ్యాహ్నం ఒకటి సాయంత్రం ఒకటి. ఏమొచ్చినా నా ప్రాణంమీదికే వస్తుంది. నాయుడు పట్టుకోలేనిది నేనుపట్టుకోవాలి ఈ నేరాలు పట్టుకోలేకుంటే, నా పాట్లు చెప్పేదేమిటి? మన ఆస్తికని పెట్టుతూ ఇంట్లో ఉండు బాబూ.

రా:—నేను మీతోవచ్చి, మీకు సాయంచేస్తాను మామయ్యా. ఆగవాళ్లలాగు ఇంట్లో కూర్చోనా?

శ్యా:—చాలామంది జమాన్లన్నారు. నీవెందుకొస్తావు? ఆటొంగలు చాలా అద్భుతమైనవాళ్లు. నాకేం జరుగుతుందో చెప్పలేను. అసాధ్యులు వీధుల్లో పట్టపగలే మనుష్యులు కనబడరు.

రా:—అందుకా మామయ్యా, ఊరు నిర్మానుష్యంగా ఉంది?

శ్యా:—చెప్పకేమి? అందుకే నీకు తలుపుతీయడానికి అనుమానించాను. ఇంట్లో జాగ్రత్తగావుండు నాయనా?

రా:—అబ్బ, నేనూ వస్తాను.

శ్యా:—(తనలో) నా కేంవాగ్శక్తోగాని, మళ్లీ అపశకునం.

రా:—మీరు అంత ముఖ్యమయిన పనిమీద వెళుతున్నారు. ఎం చేస్తారో చూచినేర్చుకుంటాను. మీతరువాత కొత్వాలు నేనేగదా!

శ్యా:—(తనలో) నారాయణా! ఇంతకంటె అపశకునమేమైనా ఉందీ—బాబూ, ఇంట్లోఉండి, ఉత్తరాది కబుర్లూ, కథలూ చెప్పుతూ మేలుకొండి. నీకిష్టమేనా వెంకూ?

వెం:—కథలంటే నాకు చాలా యిష్టం. తాతయ్యా రామేశ్వరంను

చి వచ్చినప్పుడు దక్షిణాది కబుర్లు చెప్పుకుంటాం. పిల్లవాడే పోయేడు.

రా:—రేపాయెను, అత్తయ్యా, నేను వెళ్లకమానను.

వెం—(తనలో) నా సూచన వ్యర్థం పోయిందే. అది నాయందు ప్రేమా, సాహసకృత్యాలయందు అభిలాషా?

వే—నీ కిష్టం కోరినందుకైనా ఇంట్లో ఉండవా, బాబూ?

రా—ఇలాంటి రాత్రి మళ్లీవస్తుందా, అత్తయ్యా? మామయ్యకి అంత భయంగా వున్నప్పుడు, నేను దగ్గిరుండాలి. నా సాయం అవసరం అని కాదుగాని, ఇంట్లోవుంటే నాకేం తోచదు.

శ్యా—(తనలో) పిల్ల రావద్దంటే మళ్లీ కాకీ వారిపోతాడు— బాబూ, వెళదాం రా. 8 కావచ్చింది. అమ్మా, చూస్తూ, ఏమి జరిగినా తలుపులుపెట్టుకుతీయకండి. ఇలారా. అమ్మా, (చెవిలో చెప్పును)

వెం—అలాగే, నాన్నగారూ. (తల్లికూతుళ్లుతప్ప అందరూనిష్క్రమి)

వే—వెంకూ, బాబు మునుపటికంటె చాలా బాగున్నాడుసుమా. మంచి బలం వచ్చింది.

వెం:—కాశీనీళ్లు బాగా పడ్డాయి. (తెర)

## రెండవ రంగము

కొత్వాలు యింటిదగ్గర రోడ్డు, ప్రవేశము శ్యామలరావు, రఘునాథరావు 10 జవాన్లు

రా:—మామయ్యా, ఆ మనిషి భుజాన్ని ఆ మొద్దేమిటండీ?

శ్యా—దాన్ని బొండంటారు.

రా:—ఎందుకూ అది?

శ్యా—నేరం చేసినవాడి చేతులూ, కాళ్లూ ఆ కన్నాల్లో పెట్టి ఆ కర్రశీల దానిలోపెట్టి కొట్టేస్తారు.

రా:—నేను చేతులూ, కాళ్లూ అందులో ఉంచుతాను, అదెలాగో చూపించరూ?

శ్యా—ఇప్పుడెందుకూ, బాబూ? రేప్రు ఇంటిలో చూపిస్తా.
రా—అబ్బ, నాకిప్పుడే కావాలి.
శ్యా—(తనలో) తాను పట్టిందే పట్టు—అయినా మంచిమాటలాడి నాగన్నా, నీభుజమీద బొండ కింద పెట్టూ (రాఘవరావు చేతులు కాళ్లూ ఉంచును) ఇపుడు ఆకర్రశిలఉందే, దాన్ని ఆ కర్రసుత్తితో దిక్కు చేస్తారు.
రా—మీరుంచండీ, నేను చేసిచూస్తాను.
శ్యా—తొందరగా వెళ్లుతుంటే, ఇప్పుడే కావాలా బాబూ?
రా—ఇంతలో ఏంమించి పోతుందండీ? నాయందు నమ్మకంలేకుంటే, మానిపోయెను—నేను ఈవూరు రాబట్టి మీ అందరికి ఇంతకష్టం. నేను దొంగను నన్ను నమ్మకండి—నేపోతా.
శ్యా—(తనలో) వాడికి ముక్కునుంటుంది కోపం! వాడు చెప్పడం నేను చేతులు కట్టుకొని వినడంకాడికి వచ్చింది నా అవస్థ!
రా—నేను నేర్చుకోవద్దూ? మీతర్వాత యీపాదా నాదేకదా
శ్యా—(తనలో) పెళ్లికి వెళుతూ పిల్లిని చంకపెట్టుకొన్నట్టున్నది! వీడి కిదే పదం!
రా—సరే తెలిసింది. పోనీ పోతానులెండి, నాబాధ మీకెందుకు?
శ్యా—(తనలో) వీడికి పిల్లను నేరకపోయి యిచ్చుకొన్నా—సరే, చేతులూ, కాళ్లూ ఉంచాను (ఉంచును) ఇప్పుడేమి చేస్తావు?
రా—ఏంజేస్తానా? ఇదీ (గట్టిగా కొట్టివేయును) బాగాచేసానుకానూ, మామయ్యా?
శ్యా—గట్టిగా కొట్టేశావు! చేతులూ కాళ్లూ, నలిగిపోతున్నాయి!
రా—అయ్యో! "ఇప్పుడేంచేస్తావని" మీరడిగితే, నేను సరిగా చేయగలనో లేనో చూడడానికి, ఏలాగుతీయడమో నేర్పడానికీ అడిగారనుకొన్నాను. సరిగా చేసానా? ఇక ఏలాగుతీయడమో నేర్పండి (లాగును) రాదు, గట్టిగా బిగిసిపోయింది— ఏంచేయు మన్నారు, మామయ్యా?

శ్యా—(తనలో) ఎముకలు గుంజై పోతున్నాయి! ఏమన్నా ఈరాత్రి కాశీపారిపోతాడు. పరమేశ్వరా!—ఇంటికివెళ్లి గొడ్డలిపట్టాని—ఎక్కడుందో మీా అత్తయ్యకు తెలుసును.

రా—కాని, ఏమొచ్చినా తలుపుతీయవద్దన్నారు?

శ్యా—అవునవును-వంగో, చెవులో చెప్తాను (చెప్పును)ఇదే ఆనవాలు. తలుపుదిగ్గరకిరమ్మని ఈ మాటచెప్పు-పోయిచురుగ్గా రా,

రా—ఇక్కడున్నట్టురానూ? (నిష్క్రమించును)

## మూ డ వ రం గం

కొత్వాల్ గృహం: ప్రవేశము, రాఘవరావు.

రా—(తలుపుకొట్టి)తలుపూ, అత్తయ్యా, నేనమ్మా, రాఘురావుని. చి వేయకముందే నిద్రిటమ్మా?-ఏమమ్మోయ్!-ఇంకా పలుకరేమి? మామయ్యదగ్గరనుంచి కబురు తెచ్చానమ్మా-పోనాఏమిటి?-అంత నిద్రేమిటమ్మా?

వెం—(లోపల) అమ్మా, తలుపుదగ్గిరకివెళ్లి, నాన్నగారు వెళ్లేటప్పుడు నాతో చెప్పినఆనవాలు అడగవమ్మా-

వే—వెళుతున్నా, (తలుపుదగ్గిరకు వెళ్లి) ఆనవాలేమిటి?

రా—తలుపుదగ్గిర చెవిపెట్టండీ, చెప్తాను.

వే—పెట్టాను, చెప్పు-

రా—శ్రీకృష్ణమూర్తికి ఇద్దరు తల్లులు-సరా?(తలుపుతీయును. రాఘవరావు లోపలికివెళ్లి తలుపు గడియవేయును) అత్తయ్యా, లోపలికిరండీ-

వే—వగరుస్తున్నావేమి, బాబూ? ఆ గాభరాచూపులేమిటి, తండ్రీ? తలెందుకు చింపిరైయింది?—వేగంచెప్పు, రాఘవా?

రా—ఏం చెప్పేది, అత్తయ్యా? ఇలాగవుతుందని నే నెప్పుడూ

అనుకోలేదు-

వే—ఏమయింది, తండ్రీ? మామయ్య కేమీకాలేదుగద? వేగంచె ప్పు, బాబూ నావళ్లు వణుకుతూంది-

రా—మనజమాన్లకంటె చాలామందివచ్చారు- "దొంగలసాధ్యు లులా గున్నారు-నన్నేమిచేస్తారో తెలియద"ని మామయ్యన్నారు, మీరు విన్నారుకదా?

వే—అన్నారా?

వెం—అన్నారుకారటమ్మా? ఇంతపరాకు ఎక్కడైనాఉంటుందమ్మ.

వే—అయితే, ఏమయిందిబాబూ?

రా—మనవాళ్లయినా ధైర్యముగా దెబ్బలాడుతున్నారు. నేను దె బ్బలాడాను. ఇద్దరిని పడేశాను-

వే—నీజబ్బమీద రక్తమేమిటితండ్రీ? నా కేందారి?

వెం—తడిగుడ్డ వెంటనే కట్టుతే మంచిది-ఇదుగో తెస్తున్నా (తన చీరలో ముక్కచించివేసి నీళ్లలోముంచును)

రా—దానికేం అత్తయ్యా? మామయ్యకోసం ప్రాణమైనా పెట్టే స్తాను-కానీ వినండి, మ రేంప్రమాదం రాకూడదు-మామయ్య అంత బలమైన మనిషని నే నెప్పుడూ అనుకోలేదు. ఇద్దరిమనుష్యులొచ్చి ఆయన నడుముపట్టుకొంటే, ఇద్దరినీ కిందపడేటట్టు విదలపించేశారు, కర్రసుత్తితోనాగన్న ఒకడ్నీ, నేను ఒకడ్నీ తలకాయ పగిలిపోయే టట్టుకొట్టేశాం. మరొకడ్ని జుట్టుపట్టుకొని కిందికి కూలేసి గొంతుక మీద అడుగేసి నిల్చున్నాను. "బలే, బాబూ, నీవుదెబ్బలాడొద్ద" న్నారుమామయ్య, కానిపెద్దకర్రుచ్చుకొని మామయ్యను కొట్టడా నికొస్తుంటే చూసి ఏలాగూరుకోనూ? వాడికి నడుముపట్టుకొని కిం దకు కొట్టేసి, సుత్తితో వాడులేవకుండా వేశేశాను. మామయ్య చూచి, "బాబూ, నాప్రాణం కాపాడావు. నీ ప్రాణం కాపాడు కో" అన్నారు,

వే—ఇదంతా ఎక్కడ, తండ్రీ?

రా—మనింటికి 50 గజాలదూరాన్ని-కేకేస్తే వినిపిస్తుంది.
వే—కాని, తండ్రీ, నీకా గాయం ఎలాతగిలిందోయ్? ఇంకా ర
క్తం కారుతుంది!
రా—పోనిస్తురో, అదేంచేసింది? ఆదొమ్మియుద్ధంలో మామయ్యా
నాదగ్గికివచ్చి, "బాబూ, నేను దొంగల్ను పట్టుకోవడంలో పేరున్న
వాడనని ఎరుగుదురూ-అందుచేత యుద్ధానికి తయారు పడ్డారూ.
నా ప్రాణం కాపాడినవాడవు, ఆస్తినికూడా కాపాడడానికి తగినవా
డవు నీవే. ఇంటికెలాగు వెళతావో వెళ్లి, ఇంటిలోనున్న నగలూ,
మొహరీలు మూటకట్టినూతిలో ఎత్తేశి, మళ్లీ వేగంరా" అన్నారు -
గోడలు దాటేశి లోపలికి వస్తారేమో? వేగం లెండి,అత్తయ్యా,
శ్యా—బాబూ, వేగంరావోయ్, నాస్థితి తెలిసివుండీ, ఇంకా ఏం
చేస్తున్నావు?
రా—ఇదుగో వస్తున్నా, మామయ్యా_మామయ్యమాటలు విని
ఇంకచూస్తారేమమ్మా? ప్రమాదంపోయేక, రేపు మళ్లీ నూతిలో
నుంచి ఎంతట్లో తీసుకోవాలి?
వే—(వెంకుబాయమ్మ చెవులో) చెట్టింటిలో జరిగినదంతావిని, ఎ
లాగిచ్చేది, వెంకూ?
వెం—అక్క_ఎవడో కొత్తవాడు-రాత్రి ఎలుగుబంటినిజూచి, పగ
లు మంగలంజూచి భయపడ్డాడట. నా నగలు ఇచ్చేస్తాను. (లోపలి
కి వెళ్లును)
శ్యా—బాబూ, వెళ్లినపని మరచిపోయి పరున్నావా ఏమిటి?
రా—ఇదుగోవస్తున్నానండి-అత్తయ్యా,మీాయిష్టం.మరినేవెళతా-
నాఅవసరం ఏమివచ్చిందో?(మెల్లగా)ఇచ్చేటట్టులేదు మామయ్యా!
శ్యా—నాయన్నాయనా, వేగం-నీకన్నీ తెలుసును.
రా—నా సాయంకాలాలి కాబోలు? (తలుపువద్దకు వెళ్లి గడియ
మీాద చెయ్యివేయును)
వెం—(తిరిగివచ్చి) అమ్మా, అమ్మా వేగం! అన్నీ వింటున్నావా?

ఆయన తలుపు తీశేస్తున్నారు! చెట్టి తొందరపడి పోగొట్టుకొన్నా
డు-మనం ఆలస్యంచేసి పోగొట్టుకొంటాము కాబోలు? ఇదిగో నా
నగలపెట్టె (క్రిందపెట్టును)

రా—తలుపువేసుకొండి. నేను వెళ్లాలి మీ యిష్టంవచ్చినట్టు చే
సుకొండి. మామయ్యా వస్తున్నా.

వెం—ఇంట్లోఉండి ఆస్తిజాగ్రత్తగా చూడుమని నాన్నగారు చెప్ప
లేదటమ్మా ఇలాగవుతుందని పొడగట్టింది కాబోలు? ఇప్పుడంటున్న
మాటలు బోధపడలేదటమ్మా?

వే—వెళ్లకు, వెళ్లకు, బాబూ-ఇదిగో తెస్తున్నా (లోనికివెళ్లును)

వెం—(తనలో) నాన్నగారెలాగుంటారోగదా? పరమేశ్వరా? నా
రేఖ బయలుపడ్డదని పొంగిపోతూన్నపుడు, ఈదురవస్థ ఏమిటి? భ
గవద్విలాసం మనకేమీ తెలియదుగదా? మామగారియందు ఎం
తప్రేమ! ప్రాణమైనా పెట్టేస్తారట! గాయంతగిలి రక్తంకారిపోతుం
టే, ఏమీలేదంటారు, చిత్రం! ఏమిబలము! ఏమిసాహసము! కాని
నామాటేమిటి? ఒక్కమారైనా నావైపు కన్నెత్తిచూడలేదు! ఎ
వరివైపో చూస్తున్నట్టు నటించి, ఆయనవైపు దొంగతనంగా ఎన్ని
మార్లో చూచినాను. నాకంటే ఎక్కువసిగ్గా, లేక, నాయందు అ
నాదరమా? గోపాలకృష్ణా, ఆయనమనస్సు నావైపుత్రిప్పు, రక్ష
కా! నాయందు ఆయనకుప్రేమఉంటే, పార్వతీదేవికి ఊసకప్రా
రం పెద్దకాగు కడతాను. ఆహా, ఏమదీ? గోడకు చేరబడి వాసాల
వైపుచూస్తూ ఎలాగు నిలబడ్డారో! మాయిద్దరిని కలిపి ఒకగడియ
విడిచి పెట్టడానికే మాఅమ్మ రావడం ఇంతసేపు చేస్తూంది కాబో
లు? ఈ సమయం వట్టినే పోనివ్వకూడదు. ఏదోవంకపెట్టి నావైపు
చూచేటట్టు నేనే చేయవలెను. ఈ తడిగుడ్డపట్టుకొని ఆయన యె
దుట నిల్చొని చూస్తాను. (మూటపట్టుకొని వేణమ్మప్రవేశించును)
సరే, మామంచిసమయం మించపెట్టేశాను.

వే—ఇదిగో, బాబూ, ఈమూటపుచ్చుకో. ఏదీ, వెంకూ, నీపెట్టె? (పుచ్చుకొని) ఇదికూడాను. (ఇచ్చును)

రా—:మామయ్యా, ఇచ్చారు. వస్తున్నా. అత్తయ్యా, నేనుచెప్పిన ఆనవాలు ఒక్కనాకోసమే, మామయ్యనాతో ఆలాగు స్పష్టంగా చెప్పినారు. ఏమివచ్చినా, మీరుతలుపుమట్టుకు తీయకూడదు, పల కనూ కూడదు. భద్రం! ఇదుగో వస్తున్నా, మామయ్యా-(మూట లతో పెరటిలోకి నిష్క్రమించును).

వెం—అదుగోనమ్మా, రెండుమాట్లూచప్పుడు! రెండూ నూతిలో పడవేశారు. లోపలికి పోదాం, రా-(తెర)

---

### నాలుగవరంగం

కొత్వాల్ ఇల్లు: ప్రవేశం, లోపల వెంకుబాయమ్మ, వేణమ్మ, వీధిగుమ్మంవద్ద పున్నయ్య.

---

పు—వేణమ్మగారూ తలుపండోయ్!-నేనమ్మా, పున్నయ్యనూ. పంతులుగారు చాలాకోపం చేస్తున్నారు. తలుపు తియ్యండమ్మా. తలుపుదగ్గిరికిరండీ, ఆనవాలు చెప్తాను.

వే—వెంకూ, చూశా? ఆనవాలట! బాబుకేగాని మరెవ్వరికీ కాదని నాన్నగారు చెప్పుతూంటే! తలుపునేశి తలకాయ పగలుకొట్టుకొన్నా తీయవద్దు.

పు—ఎక్కడుందమ్మా, అది?

వే—రాఘవరావుకు ఇచ్చానురా.

పు—బాబూ, రాఘవరావు బాబుకిచ్చారటండీ.

శ్యా—ఇస్తే, ఏడీ? ఇంకారాడేమి?

పు—రాఘవరావు బాబేరమ్మా?

వే—ఇక్కడలేదు.

పు—బాబూ, ఇంటికాడ లేరంట;

శ్యా—ఏమీ! అక్కడాలేక, ఇక్కడాలేక, ఎక్కడున్నాడు? అయ్యో, ఇంట్లో ఏమిజరిగిందోకదా? నేనే వెళ్లాలి. నాగన్నా, ముత్యం, నన్ను గుమ్మందగ్గరకు మోసుకోపొండి-(అలాగు చేతురు) వెంకుబాయమ్మా, తలుపూ-

వెం—అమ్మా, ఏం చేయుమన్నావు? నాన్నగారే వచ్చినారు-

వే—మీ నాన్నగారెందుకొస్తారు? ఆయన గొంతుకపెట్టుకొని ఎవడో పిలిచాడు గాని, ఆయనకారు: ముమ్మాటికీ, ఎవడో దొంగ; తలుపు తీయకు-

శ్యా—అప్పుడేనిద్రా! రాఘవరావూ! ఎక్కడున్నావోయి, తండ్రి! లేడు, ఇక్కడ లేడు! వాడు రాఘవరావే కాడు!

వే—ఎందుండీ, అలా గరుస్తారూ? బాబెందుకూ? మీరుచెప్పినట్టే చేశాము. వాడు రాఘవరావు కాడంటారేమిటి, మతిపూలినమాట?

శ్యా—వాడేడీ? అదేదీ?

వే—మీ రెక్కడుంచుమన్నారో అక్కడేఉంది-ఇప్పుడేలాగు తీయగలము? అంతా సద్దుకోనీండి ఇప్పుడెవరు దిగితీస్తాడు?

శ్యా—ఏమిటంటావు? నాకేం బోధపడదు!

శ్యా—బోధపడకుంటే పోనీయండి, నేనింతకంటే స్పష్టంగాచెప్పలేను.

శ్యా—కాని, తలుపేల తీయవు? (అనేకమంది ప్రవేశింతురు) ఎవరుమీరంతా? ఏంకావాలి?

ఒకడు—దొంగబొండలో ఉన్నాడని చూడడానికి వచ్చాం.

మరొకడు—అడుగో! అది బొండకొయ్యకాదు? అవునవును! దొంగ దొరికాడు.

అందరూ—దొరికాడు! బొండలో పడ్డాడు! నల్లబ్రాహ్మడే! బలే, కొత్వాల్ పంతులూ!

రాజు ప్రవేశించును

రాజు—బలే, శ్యామలారావుపంతులుగారూ! దొంగఎక్కడ? ఆనల్లబ్రాహ్మణుడేడీ?

ఒకడు—మహా ప్రభువువారు!

అందరూ—జయ్యా విజయీభవ! తోవియ్యండి, ప్రభువువారికి తోవియ్యండి!

రాజు—శ్యామలారావుపంతులుగారూ! దొంగెక్కడ? 5000 మొహరీలు బహుమతీ! ఇలారండి, చాలాసంతోషించినాము.

శ్యా—నన్ను కనికరించండి, మహాప్రభో, సం-

రాజు—ఒక్కదొంగే దొరికాడుకాబోలు? కాని, మీరురారేమి?

శ్యా—(తనిలో) ఆహా, దైవమా! ఏమిదురవస్థ పట్టింది!

రాజు—మాట్లాడరేమండీ, మేముపిలుస్తూంటే? రండీ.

శ్యా—రాలేను, మహాప్రభో; బొండలో ఉన్నాను—

రాజు—ఏమీ! మీరా బొండలోఉన్నది? దొంగకాడూ?

శ్యా—నేనేమహాప్రభో!

వే—వెంకూ, ఏమిటిదీ? అయ్యో! అయ్యో! మీనాన్న బొండలో పడ్డారు!

రాజు—మాప్రియజనులారా. మీరు వేలకొలది ఎందుకొచ్చారు?

ఒకడు—కొత్వాల్గారి మహిమ చూడడానికి, మహాప్రభో.

రాజు—మీకెవరుచెప్పినారు?

ఒకడు—మహాప్రభో, అల్లక్కడ! రెండురోడ్లు కలిసేదగ్గిర ఒకడు నిల్చొని "కొత్వాలువాకిట్లో దొంగ బొండలో ఉన్నాడ"ని కేకవేసినాడు. వెంటనే, ఊరంతా గుప్పుమంది మహాప్రభో—

రాజు—వెంటనే రోడ్డులోకి వచ్చి ఆమనిషెవరోచూచి వానితో మాట్లాడుంటే బాగుండేది.

ఒకడు—చిత్తం, మహాప్రభో, గాని నేను వీధితలుపు తీయబోతే వచ్చిందికాదు,

మరొకడు—మాతలుపూ వచ్చిందికాదు, మహాప్రభో.

మరొకడు—మాదిన్నీ, మహాప్రభో.

రాజు—తోవలో తలుపులన్నీ గొళ్ళాలు పెట్టిఉంటాడు! వాడేదొంగ

శ్యా—ఏలినవారు అతిదయాపూర్వకముగా దయచేసినారు.

రాజు—పహరావాడు "దొంగదొరికాడు! కొత్తనాలుగారింటిదగ్గిర బొండలో ఉన్నాడ"ని కేకవేసినాడు. అదివిని మాసంతోషం కనపర్చడానికి వెంటనే వచ్చాము. ఇలాగుజరిగినది! ఇలాగు ఎంతకాలం జరుగుతూంటుందో? పౌరులారా, చెడ్డరోజులు వచ్చినవి! కాని ఈబాధ నివారణ చేయడానికి మేము చేయవలసిన దంతా చేసితీరుతాము. మీరందరూ ఇళ్లకి వెళ్లండి.

ఒకడు—టోపీపడ్డవాళ్లలో కొత్వాల్ మూడోవాడు-తరువాతఎవరో

మరొకడు—దివానువంతు ఎవ్వరిదీయేమీ?(అందరూనిష్క్రమింతురు)

శ్యా—మహాప్రభో, మాయింటీలో జరిగినదాని బట్టిచూస్తే, నిజంగా ఏలినవారు దయచేసినారో, ప్రభువువారివేషం వేసుకొని దొంగఎవడో వచ్చినాడో, నమ్మకంలేదు, ఇంతపరాభవము అయినతరువాత నేను మరి బ్రతుకలేను.

రాజు—తప్పు, తప్పు, అటువంటిపనితప్పు! ఇందులో ఆ మనుష్యుల యొక్క అసాధారణమైన తెలివి కనిపిస్తున్నది గాని, మీ తెలివి లోప మేమీకాదు. రేపుదయం ఏడుగంటలకు జరగబోయే ఆలోచన సభలో మీ సలహా కావలెను. వాళ్లను పట్టుకోవడానికి దివాన్జీ పూనుకోలేకుంటే, మేము స్వయంగా పూనుకో వలెనేమో? రాత్రికి బాగాఆలోచించండి. మరిమేము వెళతాం (నిష్క్రమించును)

వెం—(తల్లితో) అమ్మా, దీనికంతటికీ నేనే కారకురాలను. నాన్నగారి ముఖం చూడడం విపత్తు లేకుండా ఏనూతిలో మన ఆస్తిపడవేయు మన్నామో ఆ నూతిలో పడిపోతాను.

వే—తల్లీ, తల్లీ, వెంకూ, అలాంటిపని చేయకేం! ప్రభువువారు శలవిచ్చినట్టు, వాడు అసాధ్యుడుగాని మనలోపం ఎవరిదీకాదు.

వెం—కాని, అమ్మా, అంతపవిత్రుడు లోకంలో ఎక్కడైనా ఉంటాడా? ఒక్కమారైనా, నావైపు వారచూపైనా చూచాడా? మహానుభావుడు! (తెర)

## అయిదవ రంగము

దివాన్ ఇల్లు: ప్రవేశము. నాగభూషణం, గోపాలశాస్త్రి.

నా—శాస్త్రీ, బ్రహ్మచెముడుపండు రసం పట్టించుకొని, రక్తం అనిపించినావు, బాగుంది-కాని, ఒకమాట చెప్పు. రాఘవరావువంటి వాణ్ణి చూసి ఆ పసరు రాసుకొన్నావు. అయితే చిన్నం గెడ్డం ఎందుకు అంటించుకొన్నావూ?

గో—ముఖం తీరులో ఏమైనా హెచ్చు తగ్గు లుంటే. వాటికి కమ్మడానికి.

నా—నాయుడూ, శ్యామలారావూ కలుసుకోకుండా ఎందుకు చేయుమన్నావు? ఏదో పనికల్పించి నాయుణ్ణి వెంటనే ఊళ్లోనుంచిపంపించేసినాను.

గో—వాళ్లిద్దరూ కలుసుకొంటే, తన ముచ్చట నాయుడు చెప్పవచ్చును. వాళ్లిద్దరూ ఆలోచించుకోరు గాని—

నా—ఏమీ ఏందుకాలోచించుకోరూ?

గో—తన పని యీలాగు కావడమూ, చిన్నతనం అటుండగా, శ్యామలారావుకు మాట దక్కడం నాయుడికిష్టం ఉంటుందా? కాని నాయుడు వృత్తాంతవల్ల శ్యామలారావుకు ఏదైనా ఉపాయం తోచవచ్చును. భయం లేదు గాని, నా జాగ్రత్తమీద ఉండడం మంచిది కాదూ?

నా—శాస్త్రీ, ఆ మూకలలో నిల్చొని వెంటనే మహారాజావారిని చూచినావు-ఎందుకది? మాటలు పడవేసి వెంటనే పరుగెత్తావూ?

గో—నాకు వారితో కొంత పని ఉంది-

నా—వారితో ఏమిపని? అక్కడకూడా తలపెట్టావు కాబోలు?

గో—నేను చేసిన పనిగురించి చెప్పడమేగాని, చేయబోయే దానిగురించి ఏమీ చెప్పను-శ్యామలారావు నీకు దగ్గిరవాడు గనుక ఆభోగట్టాలన్ని యివ్వగలిగావు. అదంతా వినియోగపర్చినాను. మహా

రాజా వారిగురించి నాకు కావలసినది ఏమి చెప్ప గలవూ? అందుచే
త వారిని నేను చూచి స్వయంగా కనిపెట్టవలసినవి కొన్ని సంగతు
లున్నవి.

నా—అక్కడేదో తలపెట్టినావుకాబోలు? నావళ్లు ఝల్లుమంటూంది

గో—నేను చేయడమేమీ, నీవళ్లు ఝల్లుమనడమేమోయ్?

నా—ఇదివరకు నీవు చేసిన మూడుపనులూ చాలును, నా ప్రాణం
కాపాడు కోవడానికి. బాబ్బాబు, నీపుణ్యా మాయిరి; మహారాజా
వారిమీద మట్టుకు ఏమీ తలపెట్టేవు సుమా?

గో—ఇంతవరకూ చేసింది నీ కొరకు, ఇటుపైని చేయదలచు కొన్న
ది నా తృప్తికొరకు. నా సత్తువ తెలుసుకోవడానికి. నామనస్సు
లో ఒక ఉద్దేశం ఉన్నది-అది నామనస్సులోనే ఉంటుంది-నాకు పని
ఉంది, నా గదిలోకి పోవాలి.

నా—పని ఎవరితో?

గో—కొంతవరకు మృత జీవులతోనూ, దేవునితోనూ, అటుపైని
నాతోనూ.

నా—అంటే?

గో—గ్రంథకర్తలతోనూ. గీతలతోనూ, అటుపైని రేపటి కార్యం
ఏర్పాటు చేసుకోవడం. (నిష్క్రమించును)

నా—పెద్దకుండలకు ఎసళ్లుపెట్టి, కార్యం పాడుచేయడుకద? ప్రభు
వువారే రేపు పూనుకొంటే, దొరికిపోతాడు-వారితో చెయ్యిచెయ్యి
కలిపి ఎక్కడ నిగ్రహించగలడు? సలహాయివ్వవల్ల కాదూ! ఈ
రాత్రి నాకుమరి నిద్రపట్టదు. (తెర)

# చతుర్థాంకము

## మొదటి రంగం

కోటదేవిడి: ప్రవేశము, ఒక సన్యాసి.

స—జాయ్, సీతారామ్! రెండురోజులు పస్తు? అన్నమోఅని అర
చి గొంతుక పోయింది! ఈ ఆకలి, ఈ నీరసము, ఈ నడవడమూ!
ఈ తిరగడంలో చచ్చి, పడిపోతానేమో? ప్రాణం నిలబెట్టుకొనే
ప్రయత్నంలో మనిషి ప్రాణం పోగొట్టుకో వచ్చును! మంచి ముత్యా
లకోసం సముద్రం అడుక్కి దిగుతాడు-చిమ్మ చీకటి! చేపల రాజ్యం
వెళ్లకొనలను కళ్లు పెట్టుకొని దేవవలెను. అంతా ఎందుకు? ఒ
కొకన్ని ధనికునిగా చేయడానికి! తనకు పట్టెడన్నానికి! ఏచేపకడుపు
లో పడిపోవునో! అలాగున్నది నా అవస్థ జాయ్, సీతారామ్!

(లోపల రాజు, కత్తులతో సిపాయిలు)

రా—జమాదార్, విన్నావా ఆ మాటలు!

జమాదార్—చిత్తం. మహాప్రభో, విన్నాను.

రా—ఆ జ్ఞానం చూచినావా?

స—తలుపులన్నీ వేసున్నవి! మనిషన్నవాడెవడూ కనబడడు! ఇది
మెడారా? అయితే ఈ పెద్దవీధులేమిటి? ఈ గొప్ప మేడలేమిటి?
అది కోటైయుండ వలెను. గాని ఈ దేవిడీవద్ద సిపాయి లేడేమి? రా
జు బ్రతికుంటే, ఇలాగుండునా? జయ్, సీతారామ్?

రా—జమాదార్, వింటున్నావు కాదూ?

జ—చిత్తం, మహాప్రభో, ఇలాగే కేకలు వేసుకొంటూ, నాలుగు
గంటలప్పుడు ఈ తోవనే వెళ్లినాడు. అన్నంకోసం ఊరంతా తిరి
గుండును.

రా—అదిగో గంటలు వేస్తున్నారు. ఏడుకాదూ?

జ—చిత్తం, మహాప్రభో.

రా—వాడు దొంగై యుండ వలెను. ఏమంటావు?

జ—మహాప్రభో, చాటింపు తరువాత వచ్చియుండ వచ్చును.

రా—ఏమి వాని పోతరం! మమ్ము, మా ప్రజలనూ తిట్టుతూ మా కోటదేవిడి వద్ద కూర్చోడమా?

సీ—జాయ్, సీతారామ్, రాజు చచ్చిపోయినాడా యేమి?

రా—అదుగో, మళ్లీ! మేము వెళ్లి సమాచార మేమిటో చూస్తాము.

జ—ఒక్కరేనా, మహాప్రభో?

రా—ఈ కత్తి మావద్ద ఉన్నప్పుడు వెయ్యిమంది వీరులువస్తేనేమి? దొంగలు యుద్ధానికి తయారు పడుతే బాగుండును.

జ—క్షమించవేడుచున్నాడు సౌఖరు. ఆమనిషి నిజమైనసన్యాసేమో?

రా—నిజమైన సన్యాసైతే, తపోవనంలో ఉండవలెను. ఈ భిక్షేమిటి? దేశాలు తిరిగే సన్యాసులు, ముష్టివాళ్లూ, దొంగలున్నూ, అటువంటి వాళ్లదగ్గిర చోరీ ఆస్తి శ్యామలాప్రవంతులు ఎన్నిమాట్లో పట్టినాడు. అటువంటి వాడే అయితే, మాసత్రంలో అన్నం పెట్టించండి. ఈ మనిషిది, కపటసన్యాసంలో కపట సన్యాసం అయితే, చెరసాలలో ఒంటరిగా తపస్సు చేసుకోవడమే.

జ—మహాప్రభో, ఆలాగేవచ్చినట్టయితే, ఏదో గొప్ప పన్నాగము పన్ని వచ్చిఉంటాడు. ఈమూడు అల్లరతరువాత, ఉషారిగాఉండడా?

రా—అయితేమాత్రం మమ్మల్ని ఏమిచేయగలడు? మా శరీరమునకు హానిచేయడం అసాధ్యముగదా? సురక్షితమైన మా అంతఃపురమునకుగాని, ద్రవ్యాగారమునకుగాని ప్రవేశముండదుగదా? మరియొక విధమైనహాని ఊహ్యముకాదుగదా? చేయగలంత పరీక్ష చేస్తాము, దానికి నిలబడుతె, మత్స్యశక్తి లేనివాడు, తప్పకుండా జీవించతగినవాడే. మేము తొందర పడము. నిదానించి మరీ పనిచేస్తాము. మీరందరూ—

స— జాయ్. సీతారామ్! ఈ రాజు రామచంద్రమూర్తివంటి వాడని అంటారే ఈ రాజ్యములో! అయితే ఎక్కడున్నాడు? ప్రజలెక్కడున్నారు? వారందరూ గతించి ఉండవలెను. భగవన్మాయలాగున్నది. జాయ్, సీతారామ్!

రాజు—చూచావా జమాదార్, ఆ పొగడ్త, ఆ శాపము ఒక్కనో టనే? ఆ మనిషి మా రాజ్యములో వాడుకాడు. ఎక్కడినుంచో వస్తూ మనదేశంలో వినుంటాడు ప్రజలు మాగురించి అనుకొంటున్నది. మే మొక్కరమే వెళ్లి చూస్తాము. మేము పిలిచే వరకూ మీారందరూ ఇక్కడే ఉండండి. (తెర)

## రెండవరంగము

కోటదేవిడి-ప్రవేశము సన్యాసి.

స—జాయ్, సీతారామ్! నేనఃఅన్నంలేక చచ్చిపోవలసుంటే, ఈయెడారిగ్రామంలోనే చచ్చిపోతాను-రాజుకనిపిస్తే— (రాజుప్రవేసించి వెనుకనుంచి సన్యాసినిపట్టుకొనును)-కాని, ఎవడుఆపాపిష్టిచేతులతో వెనకనుంచినన్ను పట్టుకొన్నవాడు? ఎవడాదుష్టుడు? ఇందాకావచ్చినవాడా?

రా—దొంగ! దొంగ!

స—ఓహోూనీవుదొంగవా? దొంగైతేఅయినాడుగాని?. తుదకు మనిషన్నవాడువచ్చాడు!

రా—నీవెవరవు?

స—నీవెటువంటిదొంగవో, నేనటువంటిసన్యాసిని.

రా—మేముదొంగలమా? ఎవరన్నారు?

స—నీవేఅన్నావు. సన్యాసి విభూతి దోచుగోవలెనని వచ్చినావా? హా? హా? హా?

రా—నీవెందుకొచ్చినావు? చాటింపువినలేదా?

స—ఇక్కడిప్రజలూ, రాజూ; గతించినారన్న చాటింపు. సన్యాసులుఇక్కడకువచ్చి అన్నంలేక చచ్చిపోవచ్చునన్న చాటింపు, ఈనిర్మానుష్యమయినఊరిలో విన్నాను, ఇంకావింటున్నాను.

రా—రాజుయొక్క రాజధానిలో అనవలసినమాటలా అవి?

స—రాజూప్రజలూలేని రాజధానిలోనా? తపోవనంనుంచివస్తున్న సన్యాసికివ్వవలసిన స్వాగతమా ఇది? ఇటువంటిఅద్భుతమైన రాజధానియొక్క రాజు నాకుకనిపిస్తే ఏంచెప్పుదునో?

రా—మేమేరాజులము- మాతోఏమిచెప్పుకొంటావు?

స—చెప్పుకోవడమా? బుద్ధిచెప్తాను-కానినీవురాజువా? దొంగవుకావూ?

రా—ఏమీ? దొంగలమా?

స—నా యెముకలు గుండైపోయేటట్టు, నన్నుపట్టుకొని నొక్కి వేస్తూంటే, మరేమనుకొంటాను?

రా—మేమేరాజులము.

స—నాకువీపుమీదకళ్లులేవు—దొంగవో, రాజువో, నాముందునిలబడు-సన్యాసికిఎవరైనా భయములేదు—రాజులకు రాజైన భగవంతునికేమేముభయముపడేది-

రా—ఇదుగో నీముందు నిల్చున్నాము-రాజువలె ఉన్నామో లేదో చూడు.

స—అలాగేఉన్నావు- ఆకిరీటము ఆనగలూ. పరిమళించుచున్న ఆబట్టలూ, ఆముఖము, అవన్నీ రాజుకుతప్ప మరెవరికుండును? ఈవెన్నెట్లోకూడా తళతళలాడుచున్నాయి- కానిపిరికివాడవు-

రా—ఏమన్నావూ? పిరికివారమనా?

స—అవును—లేకుంటే, సన్యాసియెదుట, ఆఅంటే మీదకత్తి పైకెత్తినిల్చోడంఎందుకు? చంపివేస్తావుకాబోలు, చంపేయ్-ఆశపెట్టడమెందుకు? కానీ, చేతనైతే- నేనిక్కడఆకలిచేతచచ్చినా, నీచేతిలోచచ్చినా, నాచావు మీఅందరిచావూఅవుతుంది—తిండో, చావో వచ్చేవరకూ నేనుఇక్కడేఉంటాను- చెయ్యిఏంచేస్తావో-

రా—మాతోనీకేంపని?ఇక్కడెందుకున్నావు?

స—నేనుఆహారముకొరకున్నాను-నీవు?

రా——కొందరుదొంగలను పట్టుకోవడానికి.
స——అందుకోసంవచ్చి. సన్యాసినిపట్టుకొన్నావూ? హా? హా? హా?
రా——వూళ్లోముగ్గురుదొంగలున్నారు, ఇంకాఉన్నారేమో తెలియదు.
స——సరే, నేనునాలుగోవాడను, నన్ను పట్టుకొన్నావు.
రా——సరే, హాస్యమనుకొన్నావా? దొంగలు మాప్రజలకు విశేష బాధకలుగచేస్తున్నారు- మారక్షకోద్యోగులనుకూడా వంచించి నా గు పట్టుకొందికి నూరుగురుఆయుధనాధులతోస్వయంగావచ్చినాము.
సీ——రామచంద్రమూర్తీ, నీవే ఇలాగువచ్చినావా? నరేంద్ర కృష్ణ రాయలు కేవలము రామావతారమే అంటారు-నీవేనా ఆపేరుగల రాజువు?
రా——మేమే.
స——షాబాష్, రాజా! ప్రజలకొరకు ఇందులోపదోవంతుశ్రమపడి నరాజులున్నారా? రాజుదైవస్వరూపుడే అన్నాడుమనువు-సింహాసన ములోని పట్టుమెత్తాయొక్క మార్దవ్యముకంటె రాజదండముయొక్క భారమునే తెలుసుకొన్నవాడవు, బలిష్ఠుడు బలహీనులకొరకు పాటు బడుటకంటే దర్శనీయమేది? బలే! రాజా! భగవంతునిపని చేయుచు న్నరాజును ,,భగవంతుడునిన్ను కాపాడుగాక?'' అనిఅందరివలె నిన్ను ఆశీర్వదించను. ,,ఇంకాభగవంతునివలె ఉండు'' అనిఆశీర్వదిస్తున్నా ను. కానిపట్నములోమనుష్యులు ఎవ్వరునూలేరేమి?
రా——(తనలో) ఇదిముఖప్రీతివలెకనబడదు- ప్రజలునిజంగా మాగు రించిఅలాగే అనుకొంటూఉండవలెను- కానిఈమనిషేమిటి? సామా న్యునితోమాట్లాడునట్టు, మాతోమాట్లాడుతున్నాడే! నీవూఅంటే నీ వూఅంటున్నాడు. సాధారణదొంగ సన్యాసులు అలాగనరే? మేము నిల్చొనిఉంటే టెక్కుగాఎలాగుకూర్చొన్నాడో! నిజంగా తపస్సుచే సుకొనేసన్యాసివలెఉన్నాడు. రామచంద్రా, ప్రజలస్తుతికి తగిన వాడ నుగాచేయి.
స——రాజా, ఊరెందుకిలాగున్నదో, నీకిష్టంలేకుంటే, చెప్పనక్కరలే

దు. ప్రతిచోటానా, యిల్లేగనుక ఎక్కడాయిల్లులేనివ్వాడను, నాకేమి; నాకు సోలెడుపాలైనా, కొన్ని అరటిపళ్లయినా యిచ్చినావంటే, నా పాదధూళి నీపట్నంమీాదదులిపివేసి ఆక్షణమేలేచిపోతాను, ఏమి?

రా—మామనస్సుఅన్యధాఉండెను- ఈసాయంత్రంఆరుమొదలు రేపుదయంఆరువరకు ఎవడైనా, ఏపనిమీాదనైనా, బైటఎక్కడైనా, కనిపించినయెడల. వానినివిచారణలేకుండా దొంగనిభావించి శిక్షిస్తామనిచాటింపించినాము-దొంగభయముచేత, ప్రజలుపగలుకూడా తలుపులువేసుకొని యిళ్లలోనేఉన్నారు.

స—రాజా, నీసంగతిచూస్తే, షట్చక్రివర్తులకు లేశమైనా తీసిపోవే! శాకుంతలలో కాళిదాసంటాడూ;—

2. ఔత్సుక్యమాత్ర మవసాదయతిప్రతిష్టా! క్లిశ్నాతిలబ్ధ పరిపాలన వృత్తి రేవమ్। నాతిశ్రమాపనయనాయ నీచశ్రిమాయ। రాజ్యం స్వహస్త ధృతదణ్డమివాతపత్రిమ్॥

అనగా; రాజునకు సౌఖ్యముఉన్నట్టుగానే, తాపత్రియములు కూడాఉన్నవి. గొడుగుశిరస్సునుకాపాడును, కాని చేతికిభారములేదా?

ఇంకావిను;-స్వసుఖనిరభిలాషః ఖిద్యసేలోకహేతోః। ప్రతిదిన మధవాతేవృత్తిరేవంవిధైవ। అనుభవతి వామూర్ధ్నా పాదపస్తీవ్ర ముష్టం శమయతిపరితాపంఛాయయాసన శ్రితాంమ్॥

అనగా చెట్టు తాను ఎండపాలై, తనక్రిందనున్న వారికి నీడనిస్తుంది, అలాగే రాజు, ప్రజల సౌఖ్యముకొరకు తనసౌఖ్యము గణించక పాటుపడును.

రాజ, కాళిదాసుని ఇంకావిను

నియమయసివిమార్గ ప్రస్థితా నాత్తదండహ ప్రశమయసి వివాదం కల్పసే రక్షణాయ। అతనుషు విభవేషు జ్ఞాతయస్సంతునామ త్వయితు పరిసమాప్తం బంధుకృత్యం ప్రజానామ్॥

అనగా—రాజు, తాను యోగ్యుడుగానుండి, అయోగ్యుల
ను శిక్షించి, యోగ్యులను సంరక్షించును-ధనమూ, బంధువులూ
ఉన్నవారుకూడా, రాజునే అందరికంటె ఎక్కువ ఆప్తునిగా ఎంచుదురు.

రాజా, చూచినావా? ఎంతటివానికీ రాజే భరవసా. ఆనమ్మ
కం మానవుని స్వభావజ్ఞానములోనిది-మానవాగ్రగణ్యుడైన దివ్య
పురుషుడైన, ఏలికగురించి యింకావిను:—

ఒకకవి అంటాడు-మనము అనుభవించే వస్తువులనుగురించి
విశేషజాగ్రత్త పుచ్చుకొంటాము-రాజు, అందరికంటె, ఎక్కువ సు
ఖించగల సామర్థ్యము గలవాడైనా, తాను అనుభవించుటకు వీలు
లేని వాటిగురించికూడా, విసుపులేకుండా జాగ్రత్త పెట్టును.

రాజా, రాజు రాజ్యరక్షణకొరకు ప్రజాసంరక్షణ కొరకు
కావలసిన వాటినన్నిటినీ జాగ్రత్త పెట్టును. ఈరాజనీతులన్నిటికి, నీ
వు ఇప్పుడుచేస్తున్నది ఉదాహరణ. ప్రజారక్షణకొరకు, నీకు చిరా
యు వుండుగాక! నీవంటిరాజులనేకులు దేశసేవకై, ధర్మసంరక్షణ
కొరకై భరతవర్షమున వర్ధిల్లుగాక!

రా:—(తనలో) మాశంకరశాస్త్రి మాకు ఇటువంటిబోధ యెన్న
డూ చేయలేదేమి-ఆకోవిలస్వరంతో ఆశ్లోకాలు ఎంతమనోహరం
గా చదివినాడు! వీనిముందు మాఆస్థాన గాయకులెందుకు? ఇతన్ని
ఎప్పుడూ మావద్ద ఉంచుకోవాలెనని కోరిక పుట్టుచున్నది. ఇతడెవ
రై ఉండునో. 'ఈ ప్రపంచములో నిజమైన ఆనందములేదని' ఇతనికి
పిన్నవయస్సులోనే నాటియుండవలెను—మీరు మొదట్లో బ్రాహ్మ
ణులై యుండినట్టున్నది.

స—గతం నస్మరామి-సన్న్యాసికి ఎప్పుడూ, శాశ్వతమైనపదవే జ్ఞాప
కం ఉండవలెను. మాకు భూతవర్తమానములతో పనిలేదు. (తన
లో) నీవు పోయి మీరు అయినది!

రా—బాగుంది, చాలాబాగుంది. (తనలో) వీనిమాటలు విన్నకొల
దీ, వీనియందు మక్కువ ఎక్కువగుచున్నదే!

స—రాజా, ఒక అరగంటముందు ఏల వచ్చినావుకావూ?
రా—వచ్చియుంటే?
స—ఒకడువచ్చి నన్ను చుట్టకి నిప్పడిగినాడు–“మళ్లీవస్తాన”న్నాడు.
రా—మరేమైనా అన్నాడా? వాడేలాగుంటాడు?
స—మరేమీ అనలేదు–నల్లగొంగళీ ముసుకువేసుకొన్నాడు. ముఖం ఏమీకనబడలేదు. “ఇక్కడెక్కడైనా అన్నందొరుకుతుందా?” అని అడుగుతే, “కొత్వాల్ పంతులింటికైనా, ఇన్స్పెక్టరు నాయుడింటికైనా, వెళ్లి అడుగు” అని నవ్వుతూ వెళ్లాడు–అప్పుడు దూరం నుంచి ఈల వినిపించింది. “ఇదుగో వస్తున్నా న”ని కేకవేసి పరిగెత్తాడు.
రా—వాళ్లిద్దరూ దొంగలే! ఎంతపనిచేశాం! అప్పుడిక్కడుంటే దొరికిపోవును. చాటింపువల్ల ఏమీ లాభం లేకపోయింది—
స—దొంగలకు లాభమే–వాళ్లు రాజవీధిలో ఏమిచేసినా, చూచే వాళ్లు ఎవరు?
రా—బాగాఅన్నారు–(తనలో) తెలివైన మనిషిలాగున్నాడు—ఆలస్యం అయిపోయింది మేము రావడం.
స—అయితేనేమి? ఈమాటు వారిద్దరూ రావచ్చును.
రా—రావచ్చును.
స—రాజా, మీఉద్యోగస్థులు చేయలేనిపని చేయవలెనని నీకున్నదా?
రా—అతి కుతూహలంగా ఉన్నది.
స—ఆహా! ఏమిగొప్పరాజు! ఏమి ఔదార్యము! ఇంతకంటె గొప్ప రాజెక్కడున్నాడు, అప్పుడుగాని యిప్పుడుగాని? కాని, రాజా, నేనొక సలహా యిచ్చేదా?
రా—(తనలో) సలహాయివ్వడమూ? సన్యాసా? మాపెద్ద ఉద్యోగస్థులే ఇవ్వలేకపోయినారు. తన కేమిదారి కనబడదని దివాన్ చెప్పినాడు–కాని ఈమనిషికూడా రాఘవరావువలె, వేషధారా?—లేక వాడే వీడా? కొత్వాల్ రాఘవరావుని చాలా శ్లాఘించినాడు–వాని

తెలివి, మానవస్వభావజ్ఞానము, జ్ఞాపకశక్తి, సాహసము, నిబ్బరము.
మొదలయినవి వర్ణనాతీతమన్నాడు-ఆగుణములన్నీ ఇక్కడకూడా
లేవా? వీడుకూడా దొంగే అనుకొందాము-అయితే, మమ్మల్ని ఏమి
చేయగలడు? ఏమిచేస్తాడో చూస్తాము-మాఊహను మించినపని ఏ
మిచేయగలడో చూడతగినదే-శ్యామలాద్రివును ఏమరుపాటుగా ఉన్న
ప్పుడు వంచించినాడు. జాగ్రత్తగాఉన్న మమ్మల్ని ఏలాగు వంచిం
పగలడో చూచితీరవలెను. ఏమిటిరానీ, చివరవరకూ చూస్తాము.

స—రాజా, నీవేమో ఆలోచనమగ్నుడవైయున్నట్టు కనిపిస్తున్నది.
సన్యాసేమిటి, ఇటువంటి లౌకికములలో సలహాయివ్వడమేమిటి, ఎ
క్కడాలేనిపని అని అనుకొన్నావుకాబోలు? పోనీ-నాకు ఏదో ఫల
హారమిచ్చి పంపించేయ్-కొన్ని అరటిపళ్లుచాలును-మాభద్రాచలం
అడవులలో అంతకంటే మాకేమిదొరుకుతాయి? జాయ్, సీతారా
మ్! భద్రాచలవాసా!

రా—ఏమిటి మీరిచ్చే సలహా?

స—అతిసులభసాధ్యమయినది-నీవు అంత పరివారంతో బయలు
దేరుతే, "నేను దొంగను, నన్నుపట్టుకో" అని ఎవడైనా నీయెదుట
గాని నిల్చుంటాడాయేమి? నీ దుస్తులూ, కిరీటమూ, మొదలయిన
వేషమంతా ఆకర్రిదానిలో ఉంచు—ఏమిటదీ?

రా—వర్షంవస్తే, పహారావాడు దానిలోనిల్చుంటాడు.

స—అవన్నీ అందులోఉంచు. నావద్ద మరొక జేగురులుంగీఉన్నది.
నీవు నావేషంవేయి. ఇదుగో విభూతి. ఈగంజాయిలో నిప్పులేకుం
డామట్టుకు చూస్తూండు. మనశరీరంలో వేడి ఎంతవసరమో, దీనిలో
నిప్పు అంతఅవసరం. నీకత్తి నీవద్దనేఉంచుకో. లుంగీలోఉంటే కని
పించదు. "జాయే, సీతారామ్!" అని అప్పుడప్పుడు అంటూకూర్చొని
ఎవడైనావస్తే, "రామచంద్రమూర్తికీజాయ్!" అని అను-వాడు దొ
రికిపోయినాడన్నమాటే-నేను నీసమీపంలో దానిచాటున ఉంటాను.
ఇదినా ఉపాయం-ఆలోచించు, లేదా. నీకేదైనా ఉపాయం కనిపిస్తే

నన్ను ఎక్కడికైనా సత్రానికి పంపించి నీపని చూసుకో. నాయం దు నీకు అనుమానముంటే! నన్ను నీ సిపాయిలకు అప్పగించు. రెన్నాళ్లాయి భోజనంలేదు. ఏమిచేస్తావో, నన్ను వేగం పంపివేయి.

రా——(తనలో) సన్యాసైనా చాలాబాగాచెప్పినాడు! నాకత్తి నావద్దనే ఉంటుంది. అతడునాకు సమీపముగానే ఉంటాడు. ఎక్కడికి పోగలడు? వాడు దొంగేకానీ, సన్యాసేకానీ, చూతాం ఏమిచేస్తాడో. కాని, నిరాయుధుడైన సన్యాసినిచూచి భయపడి మా సిపాయిలకు అప్పగించడమా! సన్యాసిలుంగీ వేసుకోవలెనట! ఏలకూడదు? రాజులకు యుద్ధమందో, తపోనిష్టలోనో మరణము శ్రేష్టమన్నాడు. మాయొక్క పిల్లకూ తగినవరుడు దొరికినాడంటే వారికి మారాజ్యము అప్పగించి అడవికిపోయి తపస్సుచేసుకోవలెనని అనుకొన్నాము గదా! ఈమనిషే నిజంగా సన్యాసైతే, అతనితోకలిసి భద్రాచలం అడివిలోనే తపస్సు చేసుకొంటామేమో? శాఠీ మావద్దకేవచ్చినది దానివద్దకు మేము వెళ్లవలసినకాలము దగ్గిరపడ్డదేమో? అది దగ్గిరపడ్డదంటే, గిరిజకు సంబంధముదొరకడముకూడాదగ్గిరపడ్డట్టే-తరువాత మాతపస్సుమాటకేమి? అంతవరకూ ఉంటామో. ఉండమో? కాన తగినసంబంధంకొరకు తపస్సు ధారపోస్తున్నాము. ఇంతకూ—

స——నీవుమళ్లీ ఆలోచనలోపడ్డావు. కొత్తవానిని వెంటనే నిమ్ముకోవడంప్రాజ్ఞుని లక్షణంకాదు, నేనుకొత్తవాడను. నన్నుశోధించవలెననియున్నదా నీకు? సావకాశంచిక్కేవరకూ, నన్ను చెరసాలలోఉంచు. శరీరమే చెరసాలగాఉన్న సన్యాసికి, మీచెరసాల అంటే భయమేమిటి? నావల్ల ప్రమాదంరావచ్చునని నీకనుమానంఉంటే, నీయిష్టంవచ్చినపని చేయి, నీక్షేమంకొరకు-నన్నేమి చేయదలచుకొన్నా, నాసలహా మట్టుకు ఆలోచించు మాభద్రాచలం సన్యాసులు నన్ను సేవానంద్ అని పిలుస్తారు.

రా__(తనలో) చిన్నప్పడు మా ఆటవస్తువులు, కత్తులు, కటార్లూ యుద్ధభూమికీ ఉద్యానవనానికి భేదంతెలియనివారము. క్షత్రియులము

ఉపరి దగ్గర వజ్రాయుధతుల్యమైన ఈకత్తి. మేము ఈసన్యాసిని చూచి భయపడి వానిని చెరసాలలో నుంచడమా? సిగ్గు! సిగ్గు! పిరా దొంగలనుకొందాం. మేముకత్తి ఎత్తినప్పుడు నిర్భయంగా కూర్చున్నాడే? ఎవరి వేలితో వాడుకంట్లో కాటుక పెట్టుకొన్నా, కన్ను బెదరుతుంది! అటువంటిది, ఏమీ బెదరడు! ఆనిర్భయం గౌరవనీయముకాదా? బహుశా, మాకు సాయంచేయడానికి భగవంతుడు పంపించిన నిజమైనసన్యాసియేమో? కానీ. ఎవరైతేనేమి! వానిఉపాయంచాలా ప్రశస్తంగాఉన్నది- మాకుఎవ్విధమయినా హానికానగాదు. మరి అనుమానమెందుకు?- సరే, సేవానంద్, మీసలహా బాగున్నది, మమ్ములను సద్యాసిగాతయారుచేయండి (సన్యాసిఅలాగుచేయును)

స—రాజా, ఇదుగోగంజాయి (ఊది, నిప్పుకెర్లించిచేతికిచ్చును)

రా—(రెండుపీర్పులుపీల్చి) ఆహా, ఏమిపరిమళం! ఎంతసా- (క్రిందపడిపోవును)

స—(లేవదీసి) తలకెక్కింది! గిల్లినా తెలివిలేదు! ఎన్నోఆలోచించినావు, రాజా. కానినేనందులో మాత్రవేయడమాత్రం కనిపెట్టలేకపోయినావు! పడుకొని తొలికోడికూసేవేళకు కోటలోఉన్న చెరసాలలోకే- ఏదీ, ఆసపకాయతుంటా, నీళ్లామీసాలుఇయ్యి- ఇక రాజుగారి బట్టలూ, కిరీటం వేసుకొంటే, అచ్చంగారాజులాగుంటాను-(అలాగు చేయును) కిరీటంనాకుసరిగ్గాఎలాగుసరిపోయిందో కొలిచి చేయించినట్టు! జమాదార్?

(జమాదార్ ప్రవేశించును)

జమా—చిత్తం, మహాప్రభో!

స—వీడుసన్యాసికాడు- దొంగ, చాలాసేపుమాట్లాడిచూచినాము- వాడు చదివినశ్లోకాలువినేయుంటావు—సంభాషణలోదింపిచూస్తే, ఒకచోటదారికిపోయినాడు. వెంటనేతాళ్లుతీసుకోవచ్చి రెడరెక్కలువిరిచికట్టి, కాళ్లుకలియగట్టి, నోటిలోగుడ్డపెట్టి అదిరాకుండా ఏర్పాటు చేసి, కోటకొట్లోపడవేసి తాళంవేసి, మాచేతికియ్యి-ధనాగారంవద్ద

అంతఃపురంవద్ద పహారావాళ్లను వెంటనేఇళ్లకు పంపించివేయి- పహారా బదలీఏర్పాటుచేయించినాము- మేముఇంతవరకుసాధించినందుకుమీ నూరుమందికీ ఈగడియనుంచి వారంరోజులు శలవిచ్చినాము- వెంట నేమేముచెప్పినపనులు చేయించు- మేముదగ్గరే ఉంటాము— (తెర) మీకుజీతాలుఎక్కువచేస్తాము

మూడవరంగం

దివాన్ ఇంటిప్రమ్మము- వెలుపల, గోపాలశాస్త్రి రాజువేషముతో లోపలదివాన్ ప్రవేశింతురు.

గో—దివాన్! తలుపుతీయండి.

నా—(తనలో) మహారాజావారిమాటల్లాగున్నవి! నాకేమిదారి? శాస్త్రిదొరకిపోయినాడు కాబోలు? వద్దని కాళ్లాగెడ్డంపట్టుకొంటే, మానాడు కాదు! "నీకోసంకాదు, నాకోసం" అన్నాడు. తనపుట్టిముంచుకొన్నాడు! నాపుట్టిముంచాడు! ఏమి—

గో—ఎవరులోపల? తలువుతీయరేమి?

నా—ఎవరది?

గో—మావద్దఅంతకాలంపనిచేస్తూ మామాటలుపోల్చుకోలేదూ?

నా—కొంపతీశాడు!—చిత్తం, మహాప్రభో! (తలుపుతీయును)

గో—వెంటనే మాకుపాలు తేగలరా?

నా—చిత్తం, మహాప్రభో! (లోపలికివెళ్లి పాలుతీసుకొనివచ్చును).

గో—(పాలుపుచ్చుకొని)- మేమిక్కడికిఎందుకు వచ్చినామో తెలుసునా?

నా—తెలియదు, మహాప్రభో

గో—మీరు చేయించినపని మాకు తెలిసినది- అచ్చొచ్చిందని తెల్లవార్లూకన్నంవేశాడట- ఆముగ్గురినీవంచించినట్లేఅనుకొన్నారా! మామీదతయారుపడడం? ఏమీ, పులిమీసాలుపట్టుకొని ఉయ్యాలూగడమా? ఏమి? ఆవణకడమెందుకు? ఏమిజరిగింది?

నా—అపరాధంచేసినాను మహాప్రభో- నాటిదర్బారులో నేనుమన
విచేసినదానిని రుజువుచేయడానికి రప్పించినాను-
గో—ఎవరిని?
నా—నాస్నేహితుడుగోపాలశాస్త్రిని.
గో—మొదటిమూడూచాలక, మామీదకూడానా? మీయిద్దరిలో
ఎవరిని శిక్షించడం?
నా—ఆమూడూచాలును, మరేమీ చేయవద్దని బ్రతిమాలినాను.
మహాప్రభో- నాకోసంకాకుంటే, తనకోసమనిచెప్పి, తయారు పడ్డా
డు, మహాప్రభో? మరెవరినిశిక్షించడమో, ఏమిమనవిచేయగలను,
మహాప్రభో! (కాళ్లమీదపడును)
గో—ద్రోహి! స్వామిద్రోహి! రాజద్రోహి? లేఇంకాలేవవేమి?
నా—రక్షించండి, మహాప్రభో! మహాపరాధిని, మహాప్రభో! ప్రా
ణంకాపాడుకోవడానికి చేసినాను, మహాప్రభో? వాడునాకొంపతీశా
డుమహాప్రభో! నేనువద్దనేఅన్నాను మహాప్రభో! మానన్నాడు మ
హాప్రభో?
గో—రాజద్రోహికిశిక్షేమిటి శిరచ్ఛేదముకాదూ?
నా—అ-అ-చి-చి-చిత్తం, మహాప్రభో!
గో—సరే, గోపాలశాస్త్రినే శిక్షిస్తాము, లే- నీవుమంచివాడవే-లే
నా—ధర్మమూర్తులు, మహాప్రభువారు. (అంటూలేచును)
గో—సరే, లోపలికివెళ్లి కాగితం, కలం, సిరాబుడ్డీతీసుకోరండి- శా
స్త్రికిఉరిశిక్ష యిప్పుడేవ్రాస్తున్నాము.
నా—చిత్తం, మహాప్రభో- తీసుకోవస్తాను. (లోనికి వెళ్లును).
గో—(రాజువేషంతీసివేసి, కిరీటంమొదలయినవి స్తంభంవెనక ఉం
చును) నాగభూషణం.
నా.—(వచ్చి) ఏమిటిది? నీవేలాగు వచ్చినావుశాస్త్రీ; ఎక్కడనుంచి
దిగబడ్డావు- మేలుకొనికలకంటున్నానాయేమి?
గో—ఏమలాఅంటున్నావు? ఆవెర్రిచూపు లేమిటి? ఆకాగితం. కలం

బుద్ధి ఎందుకు!

నా— మహారాజావారి శెలవయినది తెమ్మని.

గో— ఎందుకు? ఏమిట్రాయడానికి వారేరీ? నిజంగానే. నిలువు కాళ్ళ మీదకలకంటున్నావు! మహారాజావారేరీ?

నా— ఇప్పుడిప్పుడేదయచేసినారు.

గో— కాని ఏమిట్రాయడానికి తెమ్మనిశెలవిచ్చినారు?

నా— ఏమోనాకు తెలియదు-

గో— ప్రమాణంచేయి తెలియదని.

నా— నీయిష్టంవచ్చిన ప్రమాణంచేస్తాను.

గో— నాకు ఉరిశిక్షవ్రాయడానికికాదూ అధర్మమూతుకాలు తెమ్మన్నారు?

నా— ఎక్కడనుంచివిన్నావు? (నిశ్చేష్టుడవును)

గో— వినడంకాడికివచ్చిందే? ఈఅరుగుకిందఉండివిన్నాను- మీరెవరూకనిపెట్టలేకపోయినారు- అక్కడకివెళ్ళిచూడు.

నా— (స్తంభం చాటికివెళ్ళి) ఇదేమిటి? ఈకిరీటం, అవీ, ఇవీ, ఆ! ఆం

గో— నన్ను అప్పగించావుకదా! నీ ప్రాణం కాపాడుకోడానికి, నన్నుతీయిస్తావా? ప్రమాణం చేస్తావూ తెలియదని? సరే, వేళవస్తుంది ఇవన్నీ నేలమాళిగలో ఉంచు, మీవంటివాళ్ళను నమ్మిఎవడు బాగుపడ్డాడు? మిత్రద్రోహి! నాకోసం అదిచెప్పినావేం? నిన్ను తెలుసుకోవడం ఒకపని. (తెర)

## నాలుగవరంగం

రాజమందిరము: ప్రవేశము, సోఫామీద రాజు, ఎదుట నాగభూషణం.

రా— దివాన్జీ, మా చెరసాల యెదుట ఎన్నివేలమంది, కనబడ్డారు! మేము అక్కడ ఉన్నామని ఎలాగు తెలిసింది?

నా—సిపాయిలు నిన్న రాత్రి ఇళ్లకు తోవలో చెప్పకొంటూ వెళ్లారట

రా—ఏమని?

నా—ఏలినవారు దొంగను పట్టుకొని కోట చెరసాలలో ఉంచినార ని-అరు వేయగానే ప్రజవిరగ బడ్డారు-

రా—కొత్వాలుకి జరిగినట్టే మాకు జరిగినది. మీరులేకుంటే మేము దొంగయనుకొని మమ్మల్ని ఏమి చేసియుందురో?

నా—జరిగినది తెలిసేసరికి, కొందరు ఆడవాళ్లు మూర్ఛపోయినారు.

రా—మాకిచ్చిన గంజాయిలో ఏదో పడవేసినాడు-అసాధ్యుడు! పోనీ, దానిగురించి ఇప్పుడెందుకు? భవిష్యత్తుగురించి ఆలోచించుదా ము-వెంటనే సభ యేర్పాటు చేయ్యండి-నారాయణ చెట్టినికూడా ర ప్పించండి- మహారాణీ, మహారాజ కుమారి మమ్ములను చూడవలె నని చాలా తొందర పడుచున్నారు, వారి దుఃఖమును మా యెదట యేమీకనపర్చ కూడదని వర్తమానం చేయించినారా?

నా—చిత్తం, మహాప్రభో, చేయించినాను-శలవుప్రకారం చేస్తా మని వర్తమానం చేయించినారు.

రా—మా మనస్సులో ఒక అభిప్రాయం ఉన్నది. జనానాలో దాని ని దృఢపర్చి సభలో తెలియ జేస్తాము-మేము జనానా వారిని చూ చుటకు సిద్ధంగా ఉన్నామని వర్తమానం చేయించి సభ యేర్పాటు చేయించండి-(దివాన్ నిష్క్రమించును జనానా ప్రవేశించును)

రాణీ—నాథా, నాశక్తినిమీరి వాగ్దత్తము చేసినాను. కన్నీళ్లను ఆపుకోలేనూ

కుమారి— బాబాజీ నేనూ అంతే.

రాజు—మేము మాకన్నీళ్లతో చెమ్మగానున్న చెరసాలనేలను మరీ చెమ్మగా చేసినాము. తుడుచుకొనుటకు చేతులు స్వాధీనములేక, క న్నీళ్లు ప్రవహించినవి, అవి బాధచేతకంటే, ప్రేమచేత ఎక్కువరా వచ్చును, కాని కర్తవ్యము ఏదో ఆలోచించవలసి యున్నది. ఏమి చేయడం?

రాణీ—నాథా, నేనూ, గిరిజ, సముఖమునకు రాకముందు దీనిని గు రించి ఆలోచించినాము. ఈ మూన్నాళ్లూ మన రాజమహేంద్రవ ములో ఆ భూకంపం ఎత్తించిన మనుష్యులకు ధనం ప్రధానము కా దని అనుకొన్నాము. లేకుంటే, మన ధనాగారములోని కొట్లు అ క్కడ ఉండీ ఉండవు.

రాజు—పహరా ఉండగానే?

రాణీ—ఆకపటసన్యాసి అక్కడనుంచి, అంతఃపురమునుంచి సిపాయి లను పంపించి వేసినాడు.

కుమారి—చెట్టి లక్షలకు ఆ తరవాత వచ్చిన వేలు సముద్రమునకు ఉప్పుదర్శనం.

రాజు—మా అభిప్రాయమూ అదే.

కుమారి—బాబాజీ, దీనిలో మరియొక అంశం ఉన్నది. నిన్న రాత్రి మా నగలు తీసుకొన్నవాడు—

రాజు—ఏమీ, గిరిజా, మీనగలు తీసుకొన్నాడా?

కుమారి—చిత్తం

రాజు—వాడు మాకు చేసిన దుర్నయము నైనా క్షమించవచ్చును గాని, అంతఃపురంలో ప్రవేశించిన ద్రోహిని ముక్కలుకొట్టి పక్షు లకు ఎగరవేయ వలసినదే. వాడు మాకుదొరకనీ-మేము-మేము—

రాణీ—నాథా, వాడిక్కడికి రాలేదు.

రాజు—రాకుండా, మీనగలేలాగు తీసుకొన్నాడు?

రాణీ—కింద మహాల్ వరండాలో నిల్చొని అక్కడనుంచి "దాసీ" అని పిలిచినాడు.

రాజు—దాసీ ఎక్కడున్నది?

రాణీ—మావద్ద మేడమీద.

రాజు—తర్వాత?

రాణీ—మావద్దకువచ్చి మానగలుతీసుకొరమ్మని దాని నాజ్ఞాపించి నాడు-

రాజు—సన్యాసికి మీసాలులేవే. మేమని ఏలాగనుకొన్నది? దాసీ!
(దాసీప్రవేశించును)
దాసీ—చిత్తం, మహాప్రభో!
రాజు—నిన్నరాత్రి నీవుచూచిన మనిషికి మీసములున్నవా?
దాసీ—చిత్తం, మహాప్రభో. ఏలినవారి మీసములవలె దట్టముగా ను, చుట్ట పెట్టి ఉన్నవి.
రాజు—వానికంఠధ్వని?
దాసీ—అచ్చంగా ఏలినవారి కంఠధ్వనే-కిరీటము, ఏలినవారి దుస్తు లో వేసుకొని ఉన్నాడు, మహాప్రభో-
రాజు—ఆహా! ఏమి వాని తెలివి?
రాణీ—తమరే దయచేసినారనుకొని మేడమీదికి రమ్మని కబురు పంపినాము రానని దాసీతో చెప్పినాడు.
రాజు—అన్నాడేమి? వానిని ఎంతనికొని యాడగలను?
రాణీ—మేము వారిని అన్యులుగా ఎంచుతాము-మేము వారిని కలుసు కొనేవరకూ, మమ్ములను వారుకూడా అలాగే భావించవలెను- ఈ మాటలు జ్ఞాపకం ఉంచుకొని మనవిచేయ వలసినదని దాసీనిపంపించినాడు-
రాజు—దాసీ జ్ఞాపకం ఉంచుకోవడంకాదు, మేము బ్రతికున్నంత కాలమూ ఆ మాటలు మేము జ్ఞాపకం ఉంచుకొంటాము- ఇందిరా దేవీ, ఆ యోగ్యత మనుష్యులలో ఎక్కడైనా ఉన్నదా?
కుమారి—బాబాజీ, మాకు ఒక మహోదోపకారం చేసినారు అంత మహనీయులయెడల ఏకవచన ప్రయోగము చేయడానికి నోరురాదు "మేము ఉదయంవరకూ రాకపోయినా, ఏమి తాపత్రయం పడవ ద్దని దాసీతో చెప్పినారు. లేకుంటే, మేము ఎంతైనా, భయపడి యుందుము.
రాణీ—నాధా, దానంతటికేముందు, మేమువిన్న శ్లోకాలు ఎంత మాధుర్యముగా చదివినాడు? అటువంటి గానము మే మెప్పుడూ వి

నలేదూ-తెల్లవార్లూ శ్లోకాలు ఆలాగు చదువుతే బాగుండు నన్నది అమ్మ-

రాజు——మాకూ అంత ఆనందం కలిగినది. ముఖమునిండా విభూతి రాసుకొన్నా ఎంత అందముగానో కనిపించినది! ఆకర్షేమిటి? అంతసా గసైనవి, స్త్రీకిగాని, పురుషునికిగాని ఉండుట అతి అరుదు. వానిచ క్కదనము, ధైర్యము, బలము, చూచి వానిని ఎప్పుడూ మావద్ద ఉంచుకొంటే బాగుండు ననుకొన్నాము. మేము కత్తి ఎత్తి ఎదురు గా నిల్చుంటే, నవ్వినాడు_అంతధైర్యము మన మెక్కడా చూడ ము. కాని, ఏమిటమ్మా, గిరిజా, ఇందులో ఒక అంశమందన్నావు?

కుమారి——బాబాజీ, తమరే శలవిచ్చినారు-అయినా మనవిచేస్తాను అ మనిషి సాక్షాత్తూ శ్రీశుకులే. నిన్నరాత్రి మాయిద్దరినీ కేవల మూ అసహాయులముగా చేసినారు. అతి బలసాలి స్వైరద్యాపిని త మరే శలవిచ్చినారు. అయినా మేము క్షేమంగా ఉన్నాము—వారు అందరివంటి వారైతే, తమరు మాయిద్దరినీ ప్రాణాలతో చూచి యుండరు. ఆయన శ్రీశుకత్వమే మమ్ములను కాపాడినది. పట్టగాని కృతజ్ఞత, వారియందు గౌరవ భావము నాకు మాటరానీయకున్నది.

రాజు——మాకు ఆ మనిషి చేసిన దుర్నయమునకు ఏదో కారణం ఉండవలెనని తోచుచున్నిది. మాకందుకు దుఃఖము, కోపం పోయి పట్టరాని ఆనందము కలుగు చున్నది. కానీ. గిరిజా-

కుమారి——నాపేర నిన్న ఉదయమే శ్యామలాప్రవు పంతులు కొ మార్తె ఉత్తరం వ్రాసినది-ఉత్తరమంతా రాఘువరావు యోగ్యత గురించే-"ఒక్కసారైనా నా వైపు చూడలేదు-మా ధనమంతాపో తే పోనేగాని, అట్టి మహనీయుని దర్శమయినది-తరించినాన"ని వ్రాసినది. బాబాజీ అట్టివాడు ఒక్కడుండడమే సంభవించనప్పుడు ఇద్దరికి స్థలమేదీ, పాపభూయిష్టమైన ఈ ప్రపంచములో? కనుక ఆ రాఘువరావే యీ సన్యాసి అయి ఉండవలెను.

రాణీ—నా అభిప్రాయమూ అదే.
రాజు—తెలివిగలఎవరికైనా అదితోచకమానదు- వెంకుబాయమ్మ
వ్రాసినట్లు, అటువంటిమహనీయుని దర్శనమయినది తరించి నామని
మేమూ అనవలసిఉన్నది. పూర్వపు యుగములలోనైనా అటువంటి
వాళ్లు అతిఅరుదే- లేకుంటే, ఎక్కడో రాముడూ, భీష్ముడూ, శుకు
లూఅని ఆపేళ్లేస్మరించడమేమీ? మళ్లీ మాకు ఆమహనీయుడు ఎలా
గు కళ్లపడునో.
రాణీ—నాథా, ఎలాగైనా సంపాదించవలసిన మనిషేను. అమ్మా!
ఏమంటావు?
కుమారి—అట్టియోగ్యతగలమనిషినిచూచి ఆనందించని మనిషి ఉం
డునా?
రాజు—చూచినావా, అమ్మ ఎంత తెలివిగామాట్లాడుతుందో! అవు
ను, గిరిజా, అలాగే- ఆసన్యాసిబ్రాహ్మణుకై ఉండవలెను- అవును.
గాని, గిరిజా, ఆనలుగురొక్కడేమో, నాయుడునివంచించిన ఆడది
కూడాను. అలాగేఅయియుండవలెను. అన్నిటిలోనూ అపరిమితమ
యిన తెలివి కనపర్చినాడు.
కుమారి—బాబాజీ, మొన్న మొన్ననే ఒకగ్రంథములో చదివినాను
మనమనస్సు, పూర్తిగాగ్రహించలేని కొన్నిజాతుల గొప్పతనమున్న
దన్నాడుకవి- ధారలో పాత్రపెట్టినా నిండదు. ప్రవహించిన దానివ
ల్లగాని, పైనుంచిపడినదానివల్లనిండదు- ఆలాగుననే మనశక్తికి చా
లా పైగా ఉన్న గొప్పతనమును మనమనస్సుపూర్తిగా గ్రహించలే
దు-ఈమనిషియోగ్యతా సామర్థ్యము లట్టివేఅని నాస్వల్పబుద్ధికి
తోచుచున్నది. ఆయనకుతగినగౌరవముచేయవలెను గాని శిక్షచేయు
ట కాదని అతివినయముగా మనవిచేయుచున్నాను.
రాజు—బాగాఆలోచించినావు, తల్లీ. ఋషులుపడిపోయినారు. దేవ
తలులొంగిపోయినారు-ఈయువ్వనుడు మాత్రమునిలబడినాడు. మన
కుచేతనైనంత గౌరవముచేయవలసినదే. ఇదిసభలోఆలోచిస్తాము-

మేముసభకు వెళ్లేవేళయినది- వెళ్లేముందు, దేవీ, నీతోమాట్లాడవల
సిన పనిఉన్నది- సభకు నీవూవస్తావా?
రాణీ—చిత్తం. నాథా. వస్తాను. నీవుగిరిజా?
కుమారి—నేనూవస్తాను. (రాజూ, రాణీ, నిష్క్రమింతురు) బాబా
జీవారిమనస్సూ, అమ్మగారిమనస్సూ స్పష్టమయినది, నామన
స్సూ అంతస్పష్టముగా కనపర్చినాను- దానినిగురించేమాట్లాడుకొం
టారుకాబోలు? (నిష్క్రమించును)

దివాన్ ఇల్లుప్రవేశము, దివాన్, కొత్వాలు, నాయుడు.

శ్యా—నాగభూషణం, చాలాదూరంచెప్పినావుగాని, ఇందులోమట్టు
కు నీతోఏకీభవించలేను- ప్రభువుగారిపొగడ్తకు తగినవాడే-ఇప్పుడు
జరిగినసభవంటిది ఎప్పుడూజరగలేదు.
చెం—ఆమనిషిని పొగడడానికికూడా తగము.
నా—వాడుక్షత్రియుడైనా, బ్రాహ్మణుడైనా, తనకుమార్తె నిచ్చి
వివాహంచేస్తామని ప్రభువుగారు అనడం నాకుచాలావింతగాఉన్నది.
అట్టిఘోరమైనపనులుచేసినవాడు మనకురాజా? ఆనాలుగుపనులు చే
సినవాళ్లూ ఒక్కడేఅంటారు ప్రభువుగారు! మీయిద్దరూవాడివల్లదె
బ్బలుతిన్నవాళ్లు, బంగారం,రాఘవరావు ఒక్కడేఅయిఉండవచ్చునా?
శ్యా—రాఘవరావువేషంవేసి అంతబాగా వినికిరిచేసినవాడు, ఆడవే
షంమాత్రమే చేయలేడూ?అంతఅసాధారణమైన తెలివి నలుగురికం
టూఉంటుందీ? ప్రభువుగారుచాలాబాగాపోల్చారు. ధనాగారంవద్ద
మనిషి లేకుండాచేసి, తాళాలుతనవద్దనుంచుకొని, ఆకోట్లన్నీ తనింటి
లోవేసుకోలేక, మానివేసినాడా? అటువంటివాడు సాటిలేని ఏలికఅ
యి తీరుతాడని ప్రభువుగారు శలవిచ్చినారు. నాఅభిప్రాయమూ
అదే.
చెం—నాదీఅదే.

శ్యా—ఆమనిషెవరో బయలుపడ్డప్పుడుకదా రాజుకావడం? అప్పు
డు ఎవరిడబ్బువారికిచ్చేవేస్తాడు-నేను శుభ్రమయినభూములు కొను
క్కొని హాయిగాకూర్చొని తింటూఉంటాను. అదిగో చాటింపు, విను
చాటింపు—ఇందొల్లా చమత్తమైనోళ్లకి తెలియజేసేదేమంటే, నా
రాయణచెట్టినీ, ఇన్స్పెక్టినీ, కొత్తోల్నీ, మాపెబ్బునీ దగాచేసినో
డొచ్చి, ఆళ్లయి ఆళ్లకిచ్చేస్తే, ఆడు బాపనోడైనాసరే, రాచోడై
నాసరే, పెబ్బోరు ఆడినీ ఏటిచేయరూ, ఆరొక్క పిల్లనిఇచ్చి పెళ్లి
చేస్తారూ. పెబ్బోరు అలాశేస్తారని పెమానంచేశారోయ్! అలవా
ట్లేళ నాలుగేశాక కోట్లో చబాతుంది, ఊళ్లోళ్లంతా రావలచింది!
శ్యామ—విన్నావుగదా? అలాగు అయి తీరుతుంది. "బలే! షాబా
ష్!" అని ప్రజలెలా కేకలువేస్తూన్నారో విను. మనం దానికి అడ్డు
రాకూడదు! చెడిపోతాం. ఇదినా అభిప్రాయం, నీవు వెర్రివెర్రిపో
కళ్లకుపోక, ప్రభుచిత్తానికీ, ప్రజలఆమోదానికి అడ్డంతగిలి గోదా
వరిలో కొట్టుకోపోకు. నీవు ఆప్రయత్నంలో ఉంటేమట్టుకు, నేను
నీకు కలిసిరాను సరిగదా, నీగుట్టు బయలుపెడతాను. కలుసు కొ
న్నాముగనుక చెప్పతున్నానూ మాయింటిసంగతీ, మాచుట్టాలు
పక్కాలసంగతీ, నన్నుబాగాఎరిగిన దగ్గరబంధువుడు ఎవడో, రాఘ
వరావువేషంవేయించినాడు, అది సమయంవచ్చినప్పుడు వినియోగ
పర్చుతాను. ఆగోప్రిహి గుట్టామట్టూ అట్టబుట్ట ఆనవాళ్లతో నా
కూ తెలుసును. దానిని ఉపయోగపర్చి తీరుతాను. ఈయూరికి ఆ
ఊరు ఎంతదూరమో, ఆఊరికి ఈఊరూ అంతేదూరము. రాయి
పుచ్చుకో కొట్టినవాడ్ని, వెన్నతోకొట్టడం ఇంకా అలవాటు చేసు
కోలేదు. ఇటుపైని మనం కలుసుకోవడం ఉంటుందో ఉండదో చె
ప్పలేను. అందుచేత మనస్సులోవి నాలుగుమాటలూ వెళ్లకక్కేసి
మూడుగంటలు సభలో కూర్చొని కాళ్లకు రక్తాలు దిగిపోయాయి,
నేపోతా. (నిష్క్రమించును)

నా—శ్యామలాంగిమాటలు విన్నావుకదా? శంకరశాస్త్రిని మెల్లిగా

పూచి అలాగు కాకుండా చేతాం. కళ్లుతిరిగేటట్టు డబ్బుపారేస్తే! గో
దావర్లలో దిగుమన్నా దిగుతాడు.
చెం__(తనలో) మీరిద్దరూ కలిసి కొట్టుకో పోవచ్చును.
నా__అతడంత లౌక్యుడు లేడు.
చెం__సరే, చూడు, నీకు ఎలాతోస్తే అలాగు చేయి, చాలావేళ
య్యింది. నేనూ పోతాను. (నిష్క్రమించును)
నా__మా బాగా తెచ్చిపెట్టుకొన్నాను! గోపాలశాస్త్రి రాజైతే
నాకొంప తీస్తాడు నాసంగతి బాగా తెలుసును. నిన్నరాత్రి వాని
యెడల నేచేసిన ద్రోహంకూడా తెలిసుండి ఊరకుంటాడా? ఆ అగ్గి
కితోడు శ్యామలాప్రవుగారికి చెడిపోయినాను! వాళ్లిద్దరూ కలుస్తే, మ
రేముంది? అయినా, వాడు రాజైనతరవాత పోగొట్టుకొనేకంటే,
రాజుకాకుండా చేసేప్రయత్నంలో పోగొట్టుకోవడంమంచిది. శంక
రశాస్త్రిని పిలిపించి వెంటనే పదిహేనువేల మొహరీలు పారపోస్తా
ను. వాడొక్కడే తగిన ఉర్జీ. గోపాలశాస్త్రి, వానీసాయం కోరడం,
కొరివితో తల గోకుకొన్నట్టయింది! కాని నీవు రాజుకాకుండా అన్ని
కొంపలూ ఊపిచూస్తాను. (తెర)

# పంచమాంకము

## మొదటిరంగం కోట

ప్రవేశము_రాజు, తెరచాటున రాణీ, మహారాజకుమారి; దివాన్, కొత్వాల్, నాయుడూ, నారాయణశెట్టి, నిరంకుశవాణి, గోపాలశాస్త్రి, పౌరులు.

రాజు—మాప్రియ జనులారా,
మీరు ఆమనిషియొక్క అసాధారణ యోగ్యతలనుగురించి

మా అభిప్రాయము సహేతుకముగా వినియున్నారు. మీకరతాళ
ములవల్ల మీకూ ఆదే అభిప్రాయమని స్పష్టమయినది. ఆయోగ్యత
లకు తగిన గౌరవము చేయవలసినదని, మా అభిప్రాయమే కాకుం
డా, మారాచకార్యనిర్వాహక సభవారి అభిప్రాయముకూడాను.
ఆమనిషి బ్రాహ్మణుడైనా, క్షత్రియుడైనా, మాకుమార్తెనుఇచ్చి
వివాహంచేసి మాకు వారసులుగాచేయుట మా ప్రజలకందరికీ మ
హోపకారము చేయడమే యని మాయొక్క, మా ఆలోచన
సభయొక్క, అభిప్రాయము. (కరతాళములు) అయినను, మా
ప్రజలయొక్క అభిప్రాయమునననుసరించి చేయవలసియున్నది. (ఒక
డు, "దివ్యముగాఉన్నది" అందరూ అలాగే అందురు) ఆమనిషిపైని
పగతీర్చుకొనుటకు కారణము ఎవరికైనా యున్నయెడల, మాకున్న
కారణము ఎవరికీలేదు-తాళ్లతోకట్టిన ఆనవాళ్లు ఇవ్వగో! చేతులూ,
కాళ్లూ ఎలాగు నరిసిల్లిపోయినవో చూడండి!

అందరూ—శివా, శివా! రామ, రామా!

రాజు——తరములబట్టివచ్చిన మాకిరీటము ఆమనిషికి చిక్కినది; మేము
సన్యాసివేషము వేసినాము-మేము అతనికి మా కిరీటమిచ్చి, మారాజ్య
ము అతనికిచ్చి, సన్యసించవలసినదని భగవంతుని సంకల్పమేమో!
అట్టిమనిషి రాజుగా నున్నప్పుడు, రాజ్యమున ఏవిధమైన నేరములుండ
వని మా సభవారూ, మేమూ అభిప్రాయపడినాము-దానికి మీఆ
దరముండవలెను-(ఒకడు "అంతకంటె మాకు చేయదగినది ఉపకారము
లేదు" అందరూ "నిజమే, నిజమే") మీరు మాతో ఏకీభవించినం
దుకు అత్యానందభరితులమైనాము. ఆ మనిషి ఇక్కడున్నయెడల
మాదగ్గిరికి రావలెనని కోరుచున్నాము.

గో——(వేదిక నెక్కి) మహాప్రభో, జయా విజయీభవ! నేనే ఆ మని
షిని; ఆ నాలుగుపనులూ చేసిన వాడను. (చాలావరకూ కరతాళ
ములు) ఏలినవారి ప్రజలలో నే నొకడనై యున్నంతటి ధన్యుడను.
గోదావరి ఒడ్డున సుందరమ్మపేట అగ్రహారములో ప్రచ్ఛన్నముగా

వ్యవసాయం చేసుకొనుచూ, నా భూములమీద కాపురమున్న ఆ నామ ధేయుడను. నా సౌఖ్యముకంటె ఎవరునూ ఎక్కువ సౌఖ్యము అనుభవించలేరు. నేను మరికోరతగిన సౌఖ్యమే లేదు. వేదాల గోపాల శాస్త్రి నామధేయుడను. (కరతాళము)

ఒకపౌరుడు—గోపాలశాస్త్రి మహారాజకీ జాయ్! (కరతాళములు)

రెండవ—ఏమిస్ఫుర ద్రూపిగదా!

మూడవ—ఆముఖమున ఏమి రాచ ఠీవి!

నాల్గవ—కిరీటము ధరించుటకు అంతకంటె తగినముఖమేది?

అయిదవ—

ఆరవ—ప్రజలనోముల పంట! (కరతాళములు).

ఏడవ—ప్రభువారి ఎన్నిక భగవత్ప్రేరితము! (కరతాళములు)

ఎనిమిదవ—ప్రజారంజక మహారాజాకీజాయ్! (కరతాళములు)

తొమ్మిదవ—యువరాజా గోపాలశాస్త్రికీజాయ్! (కరతాళములు)

పదవ—బ్రహ్మర్షి సత్తమ, రాజోత్తమ, గోపాలశాస్త్రికిజాయ్! (కరతాళములు)

గో—అపర రామచంద్రమూర్తి, ఈ ప్రాచీన, మహోన్నత, సింహాసన మెక్కడు? ఈయనామధేయ అగ్రహారస్తుడెక్కడమాఅగ్రహారమునకుపోయి నేను వెనుకటివలెఉండుటకుదయప్వారక అనుజ్ఞ కటాక్షించ ప్రార్థిస్తున్నాను.

అందరూ—లేదు, లేదు,

రాజు—మహాజనులారా, రాజులు, వారివిస్తీర్ణమైన రాజ్యములతో సంతుష్టి పొందనప్పుడు, తనను వరించవచ్చిన రాజ్యలక్ష్మిని అక్కర లేదనే, ఈ మహానుభావుని ఈలోకాతీతుని, దర్శించి తరించినాము. మహాత్మా, మీరిక్కడికివచ్చి ఈ పనులెందుకు చేసినారో, విన గోరు చున్నాము.

గో—ప్రభువారి శలవైతే. మొదట ఎవరి వస్తువులు వారికిచ్చివేస్తాను- (రాజు తల ఊపును) నారాయణ సెట్టిగారూ, ఇదిగో మీ

మూటం. చెంగలాల్రివు నాయుడుగారూ, ఇవిగో మీనగలు! (అంద
రూ నవ్వుదురు). శ్యామలాల్రివుపంతులుగారూ, ఇవి మీవి. మహా
ప్రభో, ఏలినవారి కిరీటము, నగలు, దుస్తులు, కత్తి, దాఖలు చేస్తు
న్నాను. మహాశయులారా, మీకు నేను కలుగజేసిన సంతాపమును
క్షమించి, మీ వస్తువులు విలియా వేసుకోండి-

నారా—పురుషోత్తమా, ఇయన్నీ తమ సాదీనంలో ఉన్నప్పుడు, ఇ
లియా వేసుకోవడమా? మేము తమకిచ్చినవన్నీ ఉన్నాయిగాని ఆటి
ఇలునమట్టుకు మారిపోయింది. ఇంతకుముందు ఆ టిలువున్నాదే, ఆ
టిని గడ్డిపరకేలాగు చూశారే, మీ శెయ్యి తగిలి ఎలలేనివి అయి
పోయినాయి-(కరతాళములు) పేరులేని తమ గ్రామానికి తమరు ద
యచేస్తారన్నారు-ఎనకను పేరులేదనండి-మరిప్పుడో? తమరక్కడఉ
న్నందున ఇలుపైని దివ్యచేత్రం, యాత్రస్థలం అయిందికాదా?(రా
జు"షాబాష్ నారాయణచెట్టి"!) బదాల్రిచలం అంతా ఆడివేకదా!
పెద్దపులుల్లేటి, పాములేటి, ఎల్లంఅంటు ఎవడితరం? ఆయితే, రా
ములోరు అక్కడకొంతకాలము వనోసం శేశారనేకదా, అంతా
యాత్రింటాము, అంతా ఎల్తున్నాము? గొప్ప చాత్రిమన్నాం. (కర
తాళములు) మా ప్రిబోరు శెప్పినట్లు చేశారంటే, ఇంకేమైనా ఉ
న్నాదా? ఆరికిరీటంలో, రత్నాలూ, ముత్యాలూ, బంగారం, కలి
శాయే అలాగుంటుంది, ఆహా, మీరూ సంబదం కలియడం- (కర
తాళములు)

శంకర—బహుశా, రాజ్యభారజనిత తాపత్రియమగ్నులై యుండుట
కంటె, స్వచ్ఛందముగా, ప్రచ్ఛన్నముగా, తపోనిష్టలోఉండి, లోక
సౌఖ్యములను తృణప్రాయంగా చూస్తూ, పరంసాధించుకోవడం
యోగ్యమని, ఆలేపాల్రియములోనే గోపాలశాస్త్రిగారి అభిప్రాయ
మై యుండవచ్చును.

నారా—చంకర చాత్తుల్లుగారూ, మీకన్న తెలిసుండీ, మీరూ అ
లాగనడమే? జనక మహారాజు, రాజ్యం శేస్తూ తపస్సెగ్గేశినారా?

రాములోర్రో? కృష్ణమూర్తోరో? (కరతాళములు "శంకరశాస్త్రి, గ
మనించు) అందరికీ సంరచ్చిడం కంటె, మరివున్నేమేటి? చాతుర్లుగా
రూ, ఏటో సదువు లేనోడ్ని అన్నాను-మా పురానం చెప్పే అ
య్యోరంటే ఇన్నాను-మరేటీ అనకోకండి. మరి ఆరిలాగు ఈరేల
శేయకూడదు? బాబూ మరి లంచాలు ఎవరికీ పోయనక్కరలేదు-
మహాప్రభో, నాసొమ్మునన్న తిననియ్యడానికి అడుగడుక్కీ, శీటికీ
మాటికీ, ఎం ఇచ్చుకోనేవాడ్ని! (నవ్వు).

ఒకడు—బలే, నారాయణచెట్టీ, ఇంతవాడవా?

నారా—అంతా ఆర్నిచూస్తే ఒచ్చిందే-అదుగో శంకరచాత్తుర్లోరు
సద్దుకొంటున్నారు-లెగిచి, ఏయోకొత్తయి చలవిస్తారుకబోలు?

శంకర—మహాప్రభూ,

ఏలినవారితో నాకుగల సంబంధమువల్ల, ఇటువంటి సమయ
ములో, నాకుతోచినది ధారాళముగా మనవిచేయవలసియున్నది.
ప్రజలు కేవలముగా ఒక్క లౌక్యభాగమునే ఆలోచించుచున్నా
రు. నిస్సంశయముగా బ్రహ్మశ్రీ గోపాల శాస్త్రిగారు అత్యద్భుత
చరిత్రగలవారే. ఏవంచకునికిలేని సామర్థ్యముగలవారు-కాని ఇందు
లో మనము ముఖ్యముగా గమనించవలసిన అంశ మొకటి ఉన్నది.
అదికేవల లౌకికకార్య ప్రావీణ్యాస్తవ పారవశ్యులకు స్ఫురించకపోవ
చ్చును-రాజుయొక్క సత్యవ్రతమే రాజ్యముయొక్క ముఖ్యబలమని
తెలిసి ప్రభువువారు సత్యవ్రతులైయున్నారు. "సత్యాన్నాస్తి పరో
ధర్మః" అన్నాడు. ఈవేదవాక్యాగ్రగణ్యమైన ధర్మమునందు ప్రభు
వువారు చిన్ననాటినుండి అనుభవజ్ఞాన సంపన్నులైయున్నారు-ధర్మ
ములన్నీ సత్యములో ఇమిడియున్నవి-సత్యము అన్నిటికీ మూలబల
ము-అదిలేని మనిషిలో, ఏధర్మమూలేదు. "సత్యంతపస్" అన్నాడు.
ఆవాక్యము ఎంతఘనమైనది! ఎంతదివ్యమైనది! సత్యము ఆకారరహి
తమైన పరమాత్మకు ఆకారము. సత్యముఖమునే భగవంతుని చూ
డగలము. జనకాదులు, తపోధనులైనా, రాజ్యముచేసినారు, నిజమే;

కాని సత్యముగురించిన ధర్మములను ఎన్నడైనా మరచినారా? సత్య రహితులు భగవంతుని ఊహించుటెట్లు? దూరదృష్టిలేక, ఐహిక ప్రమేయజనితానందసాగర మగ్నుడు, అసాధారణ లౌకికకార్య ధురంధరుని రాముడువంటివాడని, జనకునివంటివాడని అనవచ్చును. అది కేవలముదేవదూషణ- ఎవరైనఅవతారపురుషులతో సరిపోల్చుట, కవియందుఅతిశయోక్తి, వ్యవహారికధర్మములందు దేవదూషణ- ప్రభువువారు లోకాతీతుడని వర్ణించిన గోపాలశాస్త్రిలుగారు ,తాను వంచించిననలుగురితో ఎన్నిఅబద్ధములుచెప్పెనో ఆనలుగురికే తెలుసును.

కంటకములనువిడిచిపెట్టి పుష్పములపై వ్రాలి మధురసముగ్రోలుట భ్రమరలక్షణమైనట్లు, అతిసాధారణమైన మనుష్యులలో గూడఉన్న స్వల్పమైన మంచినేగ్రహించుట ప్రభువువారియొక్కఅసమానౌదార్యస్వభావము. (పువ్వులనువిడిచిపెట్టి మలినపదార్థములపైవ్రాలుట ఈగలక్షణము) (అందరూనవ్వుదురు). తనకంటె చాలాతక్కువయోగ్యతగల వానిలోకూడా యోగ్యతనేకనిపెట్టి దానిని శ్లాఘించుట నీతిధనునిలక్షణము- (పురుషోత్తముడనదగునీతి ధనునిలో కూడా ఏదోతప్పుఎంచుట, పరమదుర్మార్గుని లక్షణము. అందరూ నవ్వుదురు.

పరోపకారః పుణ్యాయ, పాపాయ పరపీడనం. అన్నాడు- (“అసూయగురించి ఏమన్నాడు?” అందరూనవ్వుదురు) ఒకరినిబాధపెట్టుటయందే ఆనందించువాని పాపమునకు పేరులేదు- సత్యసంధుడు ఎవనికినీ బాధకలుగజేయలేదు- దైవస్వరూపులైన ప్రభువు వారికి, తలచుకొనేసరికి కన్నీళ్లువచ్చి బాధకలుగజేసినవానికి, ఏకారణముచేతనైతేనేమి, సర్వాధికారములభించినయెడల, కలుగబోయే లోకారిష్టమును ఎవడుఊహించగలడు? సామాన్యదృష్టిగలవారికి, వేలవేలకు హితవైనదని ఐహికాముష్మికదృష్టిని రెండింటియందు నింద్యమైన, ప్రమాదజనకమైన, పనిచేయవచ్చునా? ఈపట్ల మనమందరమూ ఆ

లోచించవలసినఅంశము లివిఅనిమనవిచేయుచున్నాను. మరియొకసంగతిమనవిచేయుట మరచినాను- నిన్నరాత్రిమనప్రభువువారికి వచించరాని హానికలుగజేసినమనిషిని ప్రభువువారుక్షమించుట, అది వారియసమానయోగ్యతను వెల్లడిచేయుచున్నది- కాని మనముగణించవలసినసంగతి, అట్టిఘోరకృత్యమును చేసినమనిషి సాధారణజనులకు ఎంతహానిచేయుటకైనా వెనుకదీయునా? మనకు హానిచేసినవంచకుని మనము క్షమించవచ్చును; కాని ఆఘాత ఆమనిషిగుణమును వెల్లడిచేయునే- మరిఘాతకునికిమనము సర్వాధికారము ఎలాగిచ్చి క్షేమముగాఉండగలము? మహాజనులారా! ఈయంశములన్నీ మీరుచక్కగాఆలోచించి పనిచేయవలసియున్నది- (కూర్చొనును).

నాగ—(తనలో) నేనిచ్చినధనమునకు తగినఉపన్యాసము- కానిప్రజలకందరికీ అసహ్యముగానున్న దే!

గిరిజ—(తనలో) ఏమిటీపానకంలోపుడక! కాని మాశిరోదాత్తుసుఖండించలేడా?

రాజు—మాప్రియజనులారా, మనకథానాయకుడు మాప్రశ్నకు సమా—నము తెలియజేస్తారు.

గోపాల—మహాప్రభో, మహాశయులారా,

మహావిద్వాంసులు, సత్యహారిశ్చంద్రులు, అయినపురోహితులు రాజ్యహితమును కోరియిచ్చిన ఉపన్యాసమును విన్నాము- శిశుబాలవృద్ధులకు తెలిసినదానిని, వారుశెలవిచ్చి వారిమనస్సులోనున్నదంతా వెల్లడిచేసినారు- సంస్కృతపదపూరితమైన సమాసములువాడుకచేయక, అందరికీసులభముగా తెలిసేమాటలలో, నేనిక్కడజేసినపనిగురించి మనవిచేయుచున్నాను.

వంచనచేయుటలో అబద్ధములు చెప్పడమేమీాయంటే, ఏమిమనవిచేతును! నేనుఇక్కడచేసినకార్యము, వంచించుట- నేను వచ్చినదేఅందుకు—నేనుఅదిసాధకముచేయుట, ధనాపేక్షచేతగాని, అధికారాపేక్షచేతగానికాదు. నాకుఆరెండూఅక్కర లేదు. అనినాసౌఖ్యము

నకు అవసరంలేదు- ఒకరికిరాబోయేఅధికారమునుగాని, ఉన్నఅధికా
రమునుగానిచూచి అసూయపడను. (నవ్వుదురు).

గిరిజ—)తనలో) శంకరశాస్త్రికితగిన విసురు!

గోపాల—సత్యమునుగురించి పురోహితులువారు చాలాదూరము శ
లవిచ్చినారు. నేనువంచించినవారితో ఎన్నో అబద్ధములు చెప్పినాను-
కాని నాకుఒక సంతుష్టియున్నది- వాటిలాభమును నేనుంచుకోలేదు-
ఒకటి- రెండవది, నాటకములో వేషము వేసి నటకుడు చెప్పినవన్నీ అబ
ద్ధములే- తానొకడైయుండి మరొకడనిరంగస్థలములో అనిపించుకో
నుటే అనృతతుల్యము- నేనుచెప్పిన అబద్ధములుకూడామారు వేషము
లలో చెప్పినవే- నటకులఅబద్ధములను క్షమించినట్లు, ఆనాఅబద్ధము
నుకూడా, సత్యాసక్తులయిన శంకరశాస్త్రులవారు క్షమించప్రార్థిస్తు
లు- (నవ్వుదురు). కవులుకల్పనలని పేరుపెట్టిచెప్పినఅబద్ధములనుకూ
డా వారుక్షమించకర్తలు- శంకరశాస్త్రులవారు కవులని రాజధానికి
నేనువచ్చినతరువాత విన్నాను. (నవ్వుదురు). తాముచెప్పిన అబద్ధము
లను వారుక్షమించుకొనేయుందురేమో? బూచివాడు వచ్చినాడని పి
ల్లవానిని బెదిరించుటకూడాఅబద్ధమే- అదికూడావారు చెప్పియున్నా
రోలేదో నాకు తెలియదు- మహాశయులారా, నావేషములలో నేను
చెప్పినఅబద్ధములనుగురించి వారుగానిమీరుగాని ఏమనుకొన్నా, నే
నుపరిపూర్ణుడనుకాను; పరిపూర్ణుడననినటించి, నాఅపరిపూర్ణత ఎక్కు
వచేసుకొనతలచుకోలేదు- నాకులేనియోగ్యతగురించి నేనుపన్యసిం
చుట నగుపాట్లకని తెలిసినందున, మనిషినిపరిపూర్ణునిగా చేసేదానిని
గురించి ఉపన్యసించుటకూడా నాకిష్టములేదు- (పట్టరానినవ్వు).

గిరిజ—అమ్మాజీ, చెవులకు విందుగాలేదూ? మనపురోహితుని వైపు
అందరూ ఏలాగుచూస్తున్నారో, చూడండి!

ఇందిర—చాలా భావగర్భితంగాఉన్నది.

గోపాల—మహాశయులారా! నిరతసత్యవ్రతులు, శ్రీ శంకరశాస్త్రి
లవారూ, నేనూ ఒకచోటకలిసిఉండవలసివస్తే, వారిస్వభావము నా

కుకొంతఅంటవచ్చునేమో? (నవ్వుదురు) సత్యముయొక్క అసమాన మహాత్మ్యముగురించి అంతనొక్కి ఉపన్యసించినారు అబద్ధము చెప్పే రాజువద్ద ఒక్కగడియైనా ఉండుటకు ఇష్టపడరు. ఉండరు- (నవ్వుదురు).
నాగ—(తనలో) ఇదిశంకరశాస్త్రిని దయచేయుమనిచెప్పడమే!
గోపాల—మహాశయులారా, మీకందరికీ విసుగెత్తేవరకు ప్రసంగించి ఉంటాను. (లేదు, లేదు- కానియ్యండి) నేను అనుకొన్నదానికంటే ఎక్కువ మనవి చేయవలసి వచ్చినది. "శంకరశాస్త్రిలునుంచి" వారు శలవిచ్చినవన్నీ గమనించి. ఐహికాముష్మిక దూరులు కాక కర్తవ్యము ఆలోచించిమరీ పనిచేయండి- (నవ్వుదురు)
గిరిజ—అమ్మాజీ, పురోహితునికి తోసి రాజైనది-
గోపాల—మహాశయులారా, నిన్నరాత్రి నేను చేసిన అపకృతినిగురించి మనవి చేయవలసి యున్నది. అది ప్రభువారికే మనవిచేయుట మంచిదని అతి వినయపూర్వకముగా మనవి చేసుకొను చున్నాను.
రాజు—అంది ఇందరిలోనూ వినవలె నున్నది. మీ యిష్టమువచ్చినట్లు మాట్లాడవచ్చును. మేము సంతోషిస్తాముగాని కోపగించము. మీగూఢనక్తృత్వ సామర్థ్యమునకు మరి నిదర్శనము లివ్వకుండా ధారాళముగా తెలియ జేయవలెనని మాకోరిక.
గోపాల—చిత్తం, మహాప్రభో, దివాన్‌గారికి, తమ అభిప్రాయము తెలియచేసినందుకు, ప్రమాదములేకుండిన యెడల, నేనిక్కడికి వచ్చి నేను చేసినపనులు చేసియుండను.
రాజు—ఆ తొందరపాటునకు మాకు రాత్రి శిక్షయినదే!
గోపాల—ఇంక లో, మా యేలిక యెడలను, ఈ రాజ్యముయెడలను నేను చేయవలసినవిధి ఉన్నదనుకొన్నాను.
రాజు—మీరింకా అనవసరముగా భావగర్భితముగానే మాట్లాడుచున్నారు. మాయెడల మీకున్నవిధి మాపొరపాటు కపపర్చడమే. అది దేశోపకారము చేయడమే: నాగభూషణంపంతులుగారూ, మీరు మొన్న నభలో చెప్పినది రజువైనది. అప్పుడు మేమన్నదానికి వి

చారిస్తూ, దాని పర్యవసానం, ఇటువంటి మహనీయుల సందర్శనము
లభించినందుకు చాలాసంతోషిస్తున్నాము. (కరతాళములు) మరొ
క్కటి చెప్పండీ, గోపాలశాస్త్రిలుగారూ, దాపరికమేమీ లేకుండా—
మీ యుద్యమములో మీకు ప్రాణభయము రావచ్చునని మీరు
భయపడినారా?
గోపాల—మహాప్రభో, నాభార్య భయపడినది. "వస్తే, రానీ" అ
ని నేనన్నప్పుడు ఆధీర—"మంచిదే" అన్నది. (కరతాళములు)
ఒకడు—ఆ యసమాన దంపతులను పరమేశ్వరుడు కాపాడుగాక!
(కరతాళములు)
నారాయణచెట్టి—మహాప్రభో, నాకు మాపురాణం అయ్యోరు ఒక
మాట చెప్పినారు. ఆ పెద్దవిషం అన్నిటినీ కాల్చేస్తుంటే, అందరూ
శివుడుకాడకొచ్చి రచ్చించమన్నారు. అంటే అదిమింగేస్తాను, ఏమ
యితే అయింది. ఏమంటావు, పార్వతీ? అన్నాడు. "చేసి అందర్నీ ర
చ్చించండీ" అన్నాది అమ్మోరు. అమ్మోరులాంటిది గోపాలశాస్త్రు
ల్లుగారి బార్యాగారు. (కరతాళములు)
గిరిజ—అమ్మాయీ, ఆమెను ఏలాగుచూస్తాము?
ఇందిర—అదినీలోనేఉన్నది. నీవుఆలాగు ఉండగలిగితేను, ఉంటావా?
గిరిజ—(తనలో) అమ్మాయి చాలా శ్లేషగా అన్నారే! ఇటువంటి అ
సమాన ధీరుడు ఇందరిలో పొగడిన భార్య. ఎటువంటిదై యుండునో
రాజు—గోపాలశాస్త్రులుగారూ, మీరు తలపెట్టిన కార్యము, మీ
రు చేసినట్లు మరెవ్వరు చేయగలరు? కృతజ్ఞులము. కాని మాకు ఒకొ
క్కప్పుడు తొందరపాటున్నది.
గోపాల—ఉదార మనస్కులకు, నవనీత హృదయులకు అది సహ
జమే. కాని ప్రభువువారికి దానికి ప్రతిహతమైన, ఆత్మపరీక్ష ఉన్నది.
అదిలేకుంటే, శరీరాయాసము, మనోవ్యథ ఎంతకలిగినా, నస్తుతాత్మప
రిశీలన చేయగలుగు సామర్థ్యముఉండి ఉండునా ఈ దినము?
గిరిజ—(తనలో) ఎమిసొగసైన వక్త!

రాజు—రాజుయొక్క లోపములను మీవలె నిర్భయముగా కనప
ర్చే మనిషి, రాజ్యమేలుటకు అందరికంటె తగినవాడు- (కరతాళ
ములు) మీకు మాకొమార్తెను, మా రాజ్యమును ఇచ్చుచున్నాము
(కరతాళములు) అంగీకారమేనా?
ఒకడు—నృపాల శిరోమణి నరేంద్ర కృష్ణరాయ మహారాజాకీజాయ్
ధీరోదాత్తాగ్రగణ్య యువరాజ గోపాల శాస్త్రికీజాయ్!
రాజు—మా ప్రియజనులు ఎంతఉత్సాహముగా ఉన్నారో చూచి
నారుగదా? ఏమంటారు?
గోపాల—(తనలో) నాజానకి అనుమతి లేకుంటే నే నంగీకరించగ
లనా? నాకు మతిపోయె ఎంతఆదరముగా ప్రభువువారన్నారు. కాని
ఆది నాజానకి ప్రేమతో సమానమా? ఆమెలేకుంటె, నాకు రాజ్య
మెందుకు, మహారాజకుమారెందుకు? స్వర్గమెందుకు?
గిరిజ—(తనలో) అనుమానిస్తున్నట్టున్నది. అంగీకరించకపోవచ్చును.
నేనురాచబిడ్డనని, చెప్పినట్టు విననేమోయని, అనుమానమా? ఆభా
ర్య నన్నుచూచి వినయము నేర్చుకొనవలసినట్టు ప్రవర్తించనా? ఆ
సత్యవంతునికి సావిత్రిగా నుండనా? ఆ కుగ్రామములో ఉండవలసి
వచ్చినా అతి సంతోషముగా ఉండనా?
ఇందిర—(తనలో) ఏమి ఇంకామాట లేదు!
రాజు—మీరు ఆలోచించే చెప్పవచ్చును. ఏవిధమైన అనుమాన
మున్నా రహస్యముగా మాతో చెప్పవచ్చును. సమస్తాధికారములూ
వెంటనే యిచ్చివేస్తాము.
గిరిజ—అమ్మాజీ, అధికారాపేక్షగాని ధనాపేక్షగాని లేనప్పుడు,
అంగీకరించేటట్టు ఏలాగుచేయగలము? దానికితోడు ఆ భార్యయందు
న్న అపరిమితమైన గౌరవము. విశేషచక్కనిదై యుండవచ్చును. వారి
అన్యోన్యము లోకాతీతమై యుండవచ్చును-అదిగో మళ్లీనిలబడ్డారు-
గోపాల—ప్రభువువారు నావంటి అతీ సామాన్య మనుష్యునిపై అం
త ప్రేమాగౌరవము కనపర్చుతే, నేను భరించగలనా? అర్హతలేని

దానిని కోరకూడదు, అంగీకరించనూ కూడదు-

నాగ——(తనలో) ఆమాటమీదనే ఉండు శాస్త్రీ.

ఒకడు——అర్హత లేకేమి? తమకే లేకుంటే మరి ఉన్నవాడెవడు?

అందరూ——నిజమే, నిజమే అంగీకరించండి-

గోపాల——ప్రభువువారి నిరహేతుకజాయమాన కటాక్షమువల్ల గలిగిన మైకము చాలనట్టు, మహాజనులారా, మీ ఉత్సాహము కూడానా? కాని-

జానకి——(తనలో) "కాని" వచ్చినది. ఈపైని ఏమివచ్చునో గదా?

గోపాల——కాని, మహాప్రభో, నేను స్వతంత్రుడను కాను. నాహృదయమంతా నాభార్యకు ఇచ్చివేసినాను. ఒకరింటిలో మరియొకరు దిగవలెనంటె అతని అనుమతి ఉండవలెనుగదా? నాహృదయములో ఆమె కాపురమున్నప్పుడు, ఆమెశెలవు పొందవలెనుగదా?

గిరిజ——(తనలో) వీరికి అభ్యంతరములేదు. అంతేనా? ఆమెను సులభముగా లొంగదీసు కొంటాను.

నిరంకుశ——ఓహోహోహో! ఇదేమిటి ఎక్కడాలేనివింత? ఈ మూన్నాళ్లూ అంతేసిపనులు చేయడానికి భయంలేకపోయిందిగాని, భార్యను చూస్తే భయం శాస్త్రులుగారికి! అగ్రహారస్థులకు పట్నంవాస్థుల కున్న సాహసం ఉండదు. ఈరాజధానిలో ఎందరో పెద్దపేగులను ఎరుగుదును. ప్రాతస్నానం, ముక్కుబిగించుకొని కూర్చోవడం——పద్దన అయేదాకా——విభూతిపిండికట్లు, రుద్రాక్షతావళాలు, వాళ్లను చూస్తే పాపాలు పోతాయన్నట్టుంటారు-అటువంటి మహాపురుషులు వారి భార్యల శెలవుపుచ్చుకోరు సరిగదా, వారికి తెలియకుండా ఎందరినో గ్రహిస్తున్నారు. ఆనాగరీకులు పిరికివాడంటారని భయమైనాలేదు శాస్త్రులుగారికి! ఇటువంటి మహాప్రభువువారి అల్లుడు కావడానికి శెలవుపొందాలట! మీరు ఒప్పుకొందురో, "సత్యంవద" అంటే మీకు కష్టంగాని, "ధర్మంచర" అంటే, ధర్మంచెరలో ఉండవలసినదని సాధించే శాస్త్రులువారిని పురోహితునిగా ఇట్టే కుదర్తాను.

రాజు—గోపాలశాస్త్రిగారూ, వారిని ఇక్కడికి రప్పించడానికి, తగిన ఏర్పాట్లు చేయింతుమా?
గోపాల—నేనే అక్కడికి వెళ్లడానికి శలవు దయచేయించ ప్రార్థిస్తున్నాను.
రాజు—నాగభూషణం పంతులుగారూ, వెంటనే మాఫీనాసహదా వేయించి సుందరగజమును మహల్ వద్ద ఉంపించండి-శాస్త్రిగారూ, తమరు వెంటనే మావద్ద బసచేస్తే చాలాసంతోషిస్తాము.
గోపాల—మహాప్రభో, ఆజ్ఞ శిరసావహిస్తున్నాను.
నాగ—(తనలో) ఇంకాకొంచెం ఆశఉన్నది. కొంచెమేయేమిటి? అటువంటిసవతినిరానిస్తే తనకుచాలా ప్రమాదమని శాస్త్రిభార్యకు హితోపదేశముచేయుటకు ఏనుగుకంటే వేగముగా వెళ్లి ఏర్పాటుచేసి నాభార్యనుపంపిస్తే? లేకుంటే, శంకరశాస్త్రి తనభార్యను పంపిస్తాడు. మరొక్క మొహిరీలసంచీపారేస్తేసరి? మాచక్కా చేస్తాడు—మహాప్రభో! ఇటువంటికార్యంలో బయలుదేరడానికి మంచిముహూర్తం ఉంచడం అవసరంకాదా?
రాజు—అదఆయనకే విడిచిపెట్టడంమంచిది.
నిరం—మంచిపని ఎప్పుడుచేసినా మంచిదే- ముహూర్తాలు చేయడానికి అక్కరలేదు, కొంపలుతీయడానికీఅక్కరలేదు. పిలవని పేరంటానికి వెళ్లడంనాకుఅలవాటు- అందుచేత నేను శలవుపొందడం అవసరంలేదు. ఇటువంటి మహాసమయములో నాకుతోచినది ధారాళముగా మనవి చేయవలసియున్నది. (నవ్వు) గోపాలశాస్త్రిగారికి పవిత్రిమొదలయి నచాదస్తములందు విశేషపట్టుదల. తెలివితక్కువ- ఏమీ తెలివి తక్కువఅన్నానా? పొరపాటు- నాకు కొన్నిసమయములలో తొందర పాటున్నది- (నవ్వు) కాని దానికిప్రతిహతమైన ఆత్మపరీక్షకూడా ఉన్నది. నన్నునేను తెలుసుకొన్నవాడనే- నేను అర్ధసేరుబియ్యపుఅన్నం కబళీకృతంచేసినతరువాత—సంస్కృతపదాలు పడుతూ ఉండాలి మధ్యమధ్య. బాగుచేయని బియ్యపుఅన్నంలో మధ్యమధ్య రాళ్లువచ్చి

పటాల్ మన్నట్టు- కబళీకృతం చేసినితరువాత, 52 గారెలకంటె లేక 28 ఒబ్బట్లుకంటె కడుపులోమరిచోటుండదని ఆత్మపరీక్షచేసి తెలుసుకొన్నదే.

మహాజనులారా, మహాశయులారా, సభాసదులారా, సదస్యులారా, నాప్రియమైన జనులారా:- ఈ అమృతపదములు మొదటనే అనవలసియున్నది, కాని ఉత్సాహములోమరచినాను- నేనుమింకు విసువెత్తేవరకూ ప్రసంగించినానేమో?- "లేదు, లేదు, కానియ్యండి" నిఅనరేమి? ఆగౌరవలోపము ఒక్క- నాఉపన్యాసానికి కాదు- మరియొకటున్నది. ఇది మాఘమాసమని, సంధ్యావందనము చేయనివాడికైనా, ఒకటి, పెళ్లీడు వచ్చినఆడపిల్లలున్నవారందరికే; రెండు, వెండిబంగారంఅమ్మేవారికి; మూడు తాటికమ్మ మొదలయిన పందిళ్లసామాను అమ్మేవారికి, నాలుగు మెళ్లోవిక్రయించేవారికి, తెలుసును- మళ్లీమనమందరమూ కలుసుకోవడం, రాబోయేమహాశుభజనిత, అత్యానందదాయక, అసమానపాచక సామర్థ్యనిరూఢ భక్ష్య, భోజ్య చోష్య, లేహ్య, పానీయ ఆపసోపాజీర్ణసన్నిధినే- ఆ మహాసమయుని రీక్షకులై పురోహితులు మీనమేషములు లెక్కపెట్టుచున్నారు. ఎప్పుడుఏర్పాట్లుచేతునని, ప్రియమిత్ర రత్న గోపాలశాస్త్రీ యాలింగనాయత్త చిత్తులై, నాగభూషణంపంతులుగారు గుండెలు చేతిలోపెట్టుకొనియున్నారు. మహాసౌధవిరాజమాన సుందరమ్మపేటదర్శనిలాలసులై యువరాజువారుండ మరిమనము జాలముచేయరాదు (తెర)

## రెండవరంగము

మహల్ - ప్రవేశము, ఒకసోఫాపైని గోపాలశాస్త్రి

గోపాల—(తనలో) నిన్న ఈవేళప్పుడు అంతఃపురం సగలకొరకు ఇక్కడనిల్చున్నవాడను. ఇప్పుడుఇక్కడ అత్యాసన్నుడను! ఈరాజ్య

ము నేనేలవలెనట! నిన్న ఈమహాలులో ఇన్ని సోఫాలు లేవు, ఇన్ని నిలు
వుటద్దములు లేవు, ఈపరిమళము లేమిటి? ఈపరదాలను, ఈతివాసీల
ను వాసనలతో నింపినారా? ఇవన్నీ ఈయగ్రహార వ్యవసాయదారుని
సన్మానించుటకా? ఔరా! కాని నాతోటలోని పచ్చికతివాసీ ముందర
ఈతివాసీయెందుకు? నాపూలపొదరిళ్ల పరిమళముల ముందట ఈపరి
మళములు లెక్కేమిటి? స్వభావము స్వభావమే, మానవ కల్పితము
మానవకల్పితమే నాతోటలోని చల్లనిసొగసేదీ ఇక్కడ? ఈ వైభవము
కంటికి శ్రమకలుగజేయుచున్నదే! ఇదంతా నాజానకి నాకళ్లతోనే
చూస్తుంది. ప్రేమ స్వరూపిణీ, పరిశుద్ధాంతరంగిణీ, రేపు నాప్రశ్న
మే ఎలాగు బెదురుతాలో గదా? కోపదృష్టిసహిత మందహాసము,
తేరిచూపు, నిట్టూర్పు పైచేతులు, చెమటలూరు ముఖము, కంపిం
చుచున్న దేహము, నాభుజముపై కన్నీళ్లధార—ఇదీ ఆమెజవాబు!
ఆమెశిరస్సుపై నాకన్నీళ్లు నాజవాబు. మాకన్నీళ్లుబట్టిన నారుమాలే
జవాబా! అంతవిపరీతమైన ప్రేమను నాయెడ కనపర్చిన ప్రభువువారికి?
వారికోపమునైనా భరించగలనుగాని, నాజానకి కోపమునకు నిలవగల
నా? పర్వతాగ్ర స్వేచ్ఛావిహారి, ఆపక్షి ఈపంజరములోనుండునా? బం
గారుపంజరమైనా, పంజరము పంజరమే. ఆహా ఏమి ఈప్రపంచపద్ధతు
లు, వైపరీత్యములు! ఈసన్యాసిప్రియుడు, ఈవానప్రస్థుడు, ఈలోక
బాహ్యుడు, ఈప్రపంచముయొక్క వేషములలో, కృత్రిమములలో
కాట్లాటలలో, అల్లరలలో, మునిగిపోవడమా? ఈరాజ్యము నేలుట
కంటే నన్ను నాజానకి ఏలుట ఎక్కువఆనందము నన్ను నేనేలుకొ
నుట ఆనందతమమే. నాకేల ఈచిత్తక్షోభ? ప్రభువుమనస్సు నొప్పిం
చకుండా నేను ఈఐశ్వర్యబాధ ఎలాగు తప్పించుకోవడం?

(దౌవారికుడు ప్రవేశించును.)

ఏమి, దౌవారికా, ఏమివచ్చినావు?

దౌ—మహాప్రభో, ఏలినవారితో అతితొందరగా మాట్లాడుటకు
ఎవరోవచ్చియున్నారు,

గోపాల—లోపలికి తీసుకొనిరా.(ద్వారికుడు నిష్క్రమించును) అప్పుడే మహాప్రభువు? (నాకొత్త మనిషి ప్రవేశించును) ఏమీ, నా ప్రాణపదమా, నాజానకా? ఇప్పుడే నామనస్సులో ఉన్నదానవు, నాకళ్లయెదుటనున్నావా? జానకీ, ఎటువంటివాడవైనావు!

జానకి—(ప్రశ్నకనుకూరొచ్చిని) నాథా, తమరు స్త్రీఅయినారు, నేను పురుషుడనైనాను. కాని, ఈపురుషవేషంలో ప్రభువువారు, జానకిని ఏలాగు పోల్చుకోగలిగినారో?

గోపాల—జానకీ, ఆఅంగీ, ఆతలపాగా, ఆఉత్తరీయమూ, నీపెదవులను, నీకళ్లను, నీముక్కును, నీచెక్కిళను, మార్చగలవా?

జానకి—కాని నేను దగ్గరలేని ఈస్వల్పకాలములో తమరునట్టుకు మారిపోయినారు' నేనూ మారిపోవలెను. భర్త స్థితిమారుతే, భార్య స్థితి మార్చదా?

గోపాల—నేను ప్రశ్నవేయకముందే, రెండుపర్యాయములు జవాబు ఇచ్చినావు.

జానకి—మనఆశ్రమములో వేయదలచుకొన్న ప్రశ్నకు, మనరాచభవనములో జవాబు ఇచ్చినాను.

గోపాల—సరే, ముచ్చిముమ్మాటు జవాబిచ్చినావు. నిలువెడు ముక్కుగల జంతువుమీద మరియొకగంటకు నీవద్దకి నేనువెళ్లడానికి ఏర్పాటైనది.

జానకి—బౌగాముస్తాబుచేసిన ఏనుగును ఇక్కడే చూచినాను. డాబాపైనుంచి ఎవరో ఒక అప్సరస ఆజ్ఞానుసారముగా పట్టుమెత్తాగల వెండి హౌదా అమర్చుతున్నారు.

గోపాల—ఆ అప్సరసే ఈ అప్సర సరసకు రాణైయున్నది.

జానకి—పరమానందము. తమరడుగని ప్రశ్నకు జవాబిస్తున్నాను. నేనిక్కడికితమరు వచ్చిన మరునాడే వచ్చినాను. మీరిల్లుబయలు దేరన నిమిషమే అగ్నిభయములోనుంచి మీరు కాపాడిన గ్రామానికి దానయ్యను పంపించి మంచి చురుకైనబండి తెప్పించుకొన్నాను.

రాత్రిపడేసరికి మీకు 30 మైళ్లు దగ్గరపడ్డాను. తక్కిన సగము త్రోవ మీరు నారాయణచెట్టింటిలో ఉన్నప్పుడు వచ్చినాను. భద్రాన్నీ, సిలాన్నీ సాయం తీసుకొవచ్చి తక్కిన రెండు కుక్కలికీ, దానయ్యకూ ఇల్లూ తోట అప్పగించినాను. మీరు జగన్మోహినవతార మెత్తి చెంగలావు నాయుణ్ణి వంచిస్తున్నప్పుడు, నేను పురుష వేషంతో నారాయణచెట్టి సత్రంవులో ఉన్నాను.

గోపాల—మొత్తంమీద మన మిద్దరమూ నారాయణచెట్టివల్ల ఉపకారం పొందినవాళ్లమే! కాని, జానకీ, ఆ సాయంత్రం నన్ను నీవు చూచియుంటే నన్ను పోల్చుకో లేకపోదువు.

జానకి—చీరకట్టుకొని, జుట్టుతగిలించుకొన్న మాత్రాన మీ ముఖం మారియుంటే, మిమ్ములను చూచీ చూడడములో మిమ్ముల్ని మోహించియుందును. నేను మీయెడల ఎంత విశ్వాసముగా నున్నానో, మీరు నాకు అంత విశ్వాసమైన భార్యగా ఉండియుందురు ఇదుగో మీధీర, ఇదుగో, మీభార్య-(పాగా అంగీ తీసివేయును,) నాయువ రాజా, మీరు బయలుదేరేటప్పుడు, నన్ను రాణీఅని పిలిచినందుకు నన్ను ఇంతలో నిజముగా రాణీని చేసినారే!

గోపాల—నిన్ను నీవే రాణీవిగా చేసుకోవలసినది, నేనుకాదు-అనగా నా ప్రేమలో మరియొకరాణీకి వంతుకూడనియ్య వలెను.

జానకి—మనస్పూర్తిగా, త్రికరణశుద్ధిగా. వంతు కూడనిస్తాను. మీ ప్రేమలో ఆమెకు వంతున్నప్పుడు, ఆమెప్రేమలో నాకు అంతవంరాదా?

గోపాల—అక్కడేఉన్నది, అందులోనీకు వంతుంటుందని నీకేమి నమ్మకం?

జానకి—అంతకాలము మీరువేసిన అనామకాయవేషములో మీగొప్ప కనిపెట్టినంతటి బుద్ధిశాలి, యెంత గొప్పదై యుండవలెను? అటువటి ఆమెతో వంతులు వేసుకొంటె, అంతానాదే, అంతా ఆమెదే-కాని, ఈ ఐశ్వర్యము ఆమెతో వంతుకూడడానికి కాదు. అం

దుర్గాకరకే అయితే, నేను ఇచ్చిన దానికంటె, నాకు చాలాతక్కువ వస్తుంది.
గోపాల—జానకీ, తొందరపడకు-ఆలోచించుము.
జాన—బాగా ఆలోచించే చెప్పినాను-మరియొక సంగతికూడా ఉన్నది. మీరు ఇక్కడ వేసిన వేషములు లెక్కేమిటి, మీరు మన సుందరమ్మపేటలో వేసిన వేషముందిర? ప్రపంచములో మొదటి పేరుకు మొదటిహక్కుగల అద్భుతశక్తి గలిగియుండి,ఆ కుగ్రామంలో ప్రచ్ఛన్నులై యుండుట వేషముకాదా? మీరుమరియొక విధముగా ఉన్నారుకారని విచారించు చున్నానని కాదు, మీరిక్కడ వేసిన వేషములు నాలుగూ, మరియొకరిని కాపాడుటకు-వానికి అక్కత ఉండనీ. ఉండకపోనీ-మీరు అగ్రహారములో వేసిన వేషము పది వేషములు వేసిన వారు మిమ్ములను కాపాడడానికి, ఆ నాలుగు వేషములు పోయినవి, వాటితో మొదటి వేషమూ పోయినది. మీకు తగిన స్థలము దొరికినది, అంతకంటె నిజముగా, ఆస్థలమునకు మీరు దొరికినారు. ఉపకారము చేయడమే మీదృష్టికి నిజమైనందుకుమీకు రాజ్యపదవి లభించుట, ప్రజలఅదృష్టముకాదా?మీ మతాచరణకు ఎక్కువ అవకాశము కాదా?
గోపాల—జానకీ, నాతరఘున చాలాబాగా చెప్పినావు. ఇకనీతరఫున-
జానకి—మీరుండనే ఉన్నారు.
గోపాల—ఆమె రాచపుట్టికచూసిఉండీ రానిస్తున్నావు జాగ్రత్త!
జానకీ—జాగ్రత్తకేమున్నది, నాథా? జ్వాలలో, చందనపుపేడూ, మామిడిపేడూ అభేదమయినట్లు, మీయందలి ప్రేమలో ఆరాచబిడ్డ ఈబ్రాహ్మణబిడ్డ అభేదముగా ఉండవచ్చును. ఆమెస్త్రీస్వభావములో తమర్ని వరించు చున్నదిగాని, రాజపుత్రి-వలెకాదే! మొదట స్త్రీవ్యక్తి, రాచవ్యక్తి. తరువాత ఆమెనుతమరు వివాహమాడుదానికంటె, ఆమె తమర్ని ఎక్కువ ప్రీతితో వివాహ మాడుచున్నది. తమరామెను చూడలేదుగాని ఆమె తమర్ని చూచి వరించినది. నాకళ్లు మణిగి

పోయేటట్టు చేసేది, ఈమహోన్నత పదవి కాదు, దానిని తమకు స
మకూర్చిన తమ యోగ్యతా సామర్థ్యములు, ఆ మహాసభలో తమ
ధీర,............చూచినదీ, విన్నదీగాని.

గోపాల__నీవుసభలో నాకుదూరముగాఉన్నావా?

జానకి——తమదృష్టిపథములోపడకుండా ఉన్నంత దూరముగాను, అ
న్నికనిపెట్టడానికి అవకాశమున్నంతదగ్గరగాను కూర్చున్నాను. తమర
ట్టిసముఖములో, ఆవేనవేలయెదుట, నన్నుధీరఅని ... ... ......
అన్నప్పుడు నాహృదయస్థితినిగురించి ఏమందును? ఈరాజ్య మేలుట
కంటె వేయిమడుగులు ఎక్కువపదవి కాదా?

గోపాల——నీవంతసంతోషించుట నాకుస్వర్గపదవి లభించుట కాదా?

జానకి——ఈరాజ్యములో మొదటిస్థలము అంగీకరించడానికి నాకలవు
పొందపలేనని తమరుప్రభువువారితో విన్నవించి నాకుకలుగజేసిన ఆ
నందమును, నా హృదయమును అపహరించినమీరుకాదా ఊహించ
లేరు.

గోపాల——నాకురాగల అత్యున్నతస్థలము అష్టసింహాసనముకాదు-నీ
హృదయమే- కానినీవు ఈరాజమందిరమునకు అంతతొందరగా ఎం
దుకొచ్చినావు?

జానకి——లేకుంటే, తమరుసుందరమ్మపేటలోనూ, నేను తోపలోనూ
ఉండియుందుము. ఆప్రిజను తప్పించుకొనిరాలేక తోవ అయేవరకూ
ఉండవలసివచ్చినది. నాపురుషవేషం ఇతరులను మోసపుచ్చుటకుగాని
నన్ను మోసపుచ్చుకోవడానికి కాదే.

గోపాల——కానినీవు రాజధానికేలవచ్చినావు?

జానకి——మీరు క్షేమంగాఉంటే, మీతో కలిసి యింటికి వెళ్లడానికి,
ప్రాణోపద్రవము సంభవించియుంటే, తమతో మింటికివెళ్లడానికి——

గోపాల——జానకీ, నీకెంతట్లోవస్తాయికన్నీళ్ళు? నాపూర్వజన్మ తపోఫ
లమూ, నాసమస్తమూ, బాగాఆలోచించిచెప్పు- నీవుసభలోచూచి
నదానివల్ల విన్నదానివల్ల మోహావేశబుద్ధితోకాక, నిదానించిచెప్పు-

నా ప్రేమనీతో పంచుకోవడానికి ఎవ్వరూ రాకుండా చేయడం నీనోటి లోనున్నది- నీ కాఉద్దేశమున్న యెడల మనమిద్దరమూ ఈరాత్రే యింటికిపోదాము.

జానకి—నాథా, ఆమెకు తమయోగ్యతయందు ఎంత మోహమున్నదో, ఆమెయోగ్యతయందు నాకంత మోహమున్నది. మాయిద్దరికి బాగాకలుస్తుందని నాకు బాగానమ్మకమున్నది. ఏమైనా పొరలుపుట్టిన యెడల, మాయిద్దరినీ కలపడానికి మీసామర్థ్య మేమవుతుంది? తమ రాణెనుఅంగీకరించుట నాకుచాలాసంతోషము- రానియ్యండి.

గోపాల—నీయిష్టము- నిన్ను ఇప్పుడే అంతఃపురములోకి తీసుకో వెళతాను- ( తెర )

మూడవ రంగము

అంతఃపురము- ప్రవేశము, రాజు, రాణీ, యువరాణీ, గోపాలశాస్త్రి, జానకి-

రాజు—మాకొత్త కుమారీ, ధీరా .................... జానకీ, మాకున్న పెద్దసమస్యను నీవల్ల సాధించినాము. నీభర్త ఇక్కడకి రావడానికి శలవుఇవ్వడంలో ఉదారసాహసము కనపర్చినావు. మా కుమార్తెను అంగీకరించుటకు అనుమతిఇవ్వడములో అంతకంటెఅసమానధీయుక్త ధైర్యమును కనపర్చినావు- ఈపదవినిచూచి మోహించక, నీభర్త యొక్క యోగ్యతను కనిపెట్టగలుగు యోగ్యత మాకుమార్తెకు కలదని, నీసౌఖ్యమునకు భంగముకలుగదని ఎంచినంతటిబుద్ధిశాలివి- మీరుముగ్గురూ మారాజ్యభారమువహించినప్పుడు, నీవుపెద్దరాణీవి, గిరిజ చిన్నరాణీ- మాకుమారికి భర్తదానముచేసినావు. మాకువంశోద్ధారుని దానముచేసినావు-మాప్రజలకుసాటిలేని ప్రభుదానముచేసినావు-

రాణీ—అమ్మా, ఇదుగోనీచెల్లెల్ని నీకప్పగిస్తున్నాను. ( చేతిలోచేయి వేయుచును) ఆమెఎల్లప్పుడూ నీయెడలభయభక్తులతో మెలగుచూ

ఉంటుంది. ఏమి, గిరిజా?

గిరిజ—అమ్మాజీ, అదినాక్షేమముకొరకే, నాఆనందముకొరకే. తమకడుపున నేనొక్కర్తెనేపుట్టినా, నేటినుండితమకు ఇద్దరుకుమార్తెలు. బుద్ధితోకనుకొన్నకొమార్తె గర్భవాసికంటె ఎక్కువే.

జానకి—నేనుదానముచేసినానని బాబాజీసర్కారుశెలవిచ్చినారు- నేనుచేసినది నిదానముగాని, దానముకాదు.

రాణి—నాథా, మన పెద్దకుమారి ఎంతముద్దుగా మాట్లాడుతుందో చిత్తగించినారా?

గిరిజ—అక్కయ్యంటె అందుకేతమకంతముద్దు. ఇందాకా మహాలులో జరిగినదంతా విన్నప్పుడు, మాఅక్కయ్యభావ ప్రౌఢిమ, వాక్ప్రౌఢిమా చూచి, అమ్మాజీ, తమరెన్నిమార్లో అక్కయ్యనుముద్దుపెట్టుకొన్నారు.

రాజు—బాబూ, వచ్చేవారం వివాహ నిశ్చయించినాము.

గోపాల—మహాప్రభూ, నేను రేపుబయలుదేరి కాశీకివెళ్లవలెననుకొన్నాను.

రాజు—వివాహానంతరము కూడదా?

గోపాల—ముందే వెళ్లవలసిన తొందరపనిఉన్నది.

రాజు—అక్కడెన్నాళ్లుండవలసినపని?

గోపాల—జానకిఅంతకంటె ఎక్కువ ఉండవలెనని కోరితేనేతప్ప, ఒకటిరెండురోజులకంటె ఎక్కువపట్టకపోవచ్చును.

రాణి—జానకికూడా ఉండవతెనా, బాబూ?

రాజు—దగ్గరఉంటేనేమంచిది. మరిమూడవమనిషిని చేరనియ్యము.

రాణి—ఇటువైన జానకిసెలవుఒక్కటేచాలదు. గిరిజకూడాఉన్నది. శంకరశాస్త్రి కాశీవాసం తలపెట్టినట్టువిన్నాము. నిజమేనా?

గోపాల—ఈరాత్రే ప్రయాణము.

రాణి—అయితే వివాహము ఎవరుచేయిస్తారు?

రాజు—నారాయణచెట్టిని బాగుచేసిన బ్రాహ్మణుడు ఉండనే ఉ

న్నాడు.
జానకి—అమ్మాజీ, పెళ్లిలోపాలుకోసం ఎవరినివెతుక్కోనక్కరలే
దు. నాయుడు బంగారినిపంపిస్తాడు.
రాజు—పాటలోసన్యాసిఏమిటక్కా? బాబూనీవు సన్యాసినికలుసు
కొంటే, నీకుబోధచేస్తూ మనవద్దఉండేటట్టుచేయి.
జానకి—శంకరశాస్త్రిలేనివెల్తి సన్యాసేతీర్చవలెను.
రాజు—బాబూ, సన్యాసినీవద్దఉండిపోతే, జనకునివంటి రాజువవు
తావు.
రాణీ—జానకివంటి కుమార్తె కలుగుతుంది. నాయనా, శంకరశా
స్త్రివంతు మంచివాడు నీదృష్టిలో ఎవరైనా ఉన్నారా?
జానకి—కృష్ణావధానిని పిలిపిస్తారు. కాదండీ?
గోపాల—చాలా విద్వాంసుడు, శాస్త్రవేత్త. యోగ్యుడు.
రాజు—నీయిష్టం, బాబూ-
రాణీ—మీ ముగ్గురినీ, విశ్వేశ్వరుడు, మాతాన్నపూర్ణ ఎప్పుడూ
కాపాడుగాక! గిరిజ మీయిద్దరికీ తగినదానిగా చేయుగాక!
రాజు—తథాస్తు! (తెర)

## నాలుగవరంగము

దివాన్ ఇల్లు - ప్రవేశము. నాగభూషణం, చెంగలార్యనాయుడు.

నాగ—నాయుడూ, మరేమీ చెప్పకు. నేను కాశీవాసం నిశ్చయం
చేసుకొన్నాను. ఉద్యోగముపోయి, లక్షలూపోయి, ఇక్కడ ఏమని
ఉండగలను? రెండు నెలల క్రిందట శంకరశాస్త్రితో వెళ్లిఉంటే బా
గుండునేమో?
చెంగ—లెక్కలు కల్పించలేకపోయినావా?
నా—ఎలాగు చేయడం, నాయుడూ? దేనికీ వ్యవధిఏదీ? ఉదయం

ఆరుగంటలకు కాశీనుంచి వచ్చినాడు, తొమ్మిది వేయకుండా కాగితం పంపించినాడు. వ్యవధిఉన్నా, గోపాలశాస్త్రికి నా సంగతి బాగా తెలుసును. నాకు పిత్రియం ఉన్నదని, చెప్పకొందికి తగినది లేనప్పుడు, సాలుకు 40 వేలు వచ్చేవసతి ఎలాగొచ్చినదని కనపర్చేది? ఇటుపైని ప్రతి ఉద్యోగస్థుడూ, తనపిత్రియమూ, స్వార్జితమూ, సగుట్టున నెలకి రాబడి, ఎంతకాలం ఉద్యోగంలో ఉన్నాడో, తెలియ జేయ వలెనని తాఖీదు చేస్తాడట.

చెంగ—ఏమగ దిగగానే, భార్యను కోటకుపంపివేసి, తాను శ్యామలాంబింటికి వెళ్లి రాఘవరావుని అప్పగించినాడటూ?

నాగ—అంత తొందరగా కాశీప్రయాణం రాఘవరావుని తీసుకోరావడానికేనూ ఆనాటిరాత్రి రాఘవరావు వేషం వేసుకొని, శ్యామలాంబవుని ఆశపెట్టినాడు. అతని కొమార్తవంటి గుణవతి ఎక్కడా లేదు. తన వివాహకాలమందు ఆపిల్ల మంగళారతివ్వవలెనట. ఆ రాఘవరావే మీాదివాన్.

చెంగ—ఏమిటే, రాఘువరావుదివానా? ఏమిటూ తెలివితక్కువ, నాగభూషణం?

నాగ—రాఘవరావు కాశీఎందుకు పారిపోయినాడో నీవువింటే, అంతకంటె తగినవాడెవ్వడని నీవేఅంటావు. ఆకుర్రవానికి పెళ్లయిన మూడు నాలుగురోజులకు, శ్యామలాంబ ఎవరిదగ్గరో పెట్టెనిండా లంచం పుచ్చుకొన్నాడట అది రాఘవరావుచూచి కూడదన్నాడట. "ఇదంతా నీకోసమేనోయ్. ప్రపంచజ్ఞానంఉంటే, నీవు అలాగంటావా?" అని ఆ మొహరీలు పెట్టెలో వేసుకొన్నాడట. ఆ రాత్రే ఆ పిల్లవాడు కాశీ పారిపోవడం.

చెంగ—అయితే రాఘవరావు మళ్లి ఆగుచ్చుం ఏమని తొక్కినాడు?

నాగ—శ్యామలాంబ, తనకు జ్ఞాపకం ఉన్నంతమట్టుకు ఎవరిసొమ్ము వారికి పిలిచి యిచ్చివేయడం, జ్ఞాపకంలేని పద్దులన్నీ ధర్మంచేసి వేయడం,షరతులపైన వచ్చినాడు. కాశీలో శుభ్రంగా చదువుకొన్నాడు.

తనవలె యథార్థమైన మనిషి పాతికేళ్లవాడు. అతనికి నాఉద్యోగ మిస్తేనేమి?

చెంగ—ఇదంతా నీకెలాగు తెలుసును?

నాగ—నీతో ఇంతకాలం ఎప్పుడూ చెప్పలేదు. శ్యామలాశ్రవుతైనా తోటలో ఉన్న వెంకటస్వామి నాచారుడు. వ డువిని నాతో చెప్పినాడు.

చెంగ—కాని ఆ సభరోజున మనము చేసినకుట్ర గోపాలశాస్త్రికి ఎలాగు తెలిసియుండవచ్చును? ఆతడుఎలాగూరాజవుతాడనుకొని శాస్త్రి దయసంపాదించడానికి, శ్యామలాశ్రవు అంతా చెప్పియుండవచ్చునేమో?

నాగ—అంతవాడే, అప్పుడు నన్ను ముదలకించి మరి కలుసుకోమని చెప్పి చాలా కోపంతో వెళ్లాడు.

చెంగ—ఆ కుట్రసంగతి తెలిసి నీకు ఈ హానంతా చేసినాడేమో శాస్త్రి?

నాగ—అందుచేతకాదు-చాలాఔదార్య మయినవాడు. "నాగభూషణం ఎంత ఆర్జించినావోయ్ ఏంచేస్తున్నావోగాని?"ని అని నాతో మొదటిలోనే అన్నాడు. అందుకేదో ఘాతచేస్తాడని రాజుకాకుండ ప్రయత్నం చేసినాను. ప్రాణం కాపాడినందుకు 5 వేల మొహారీలు ఇవ్వబోతే- "నేనేమి డబ్బుకోసం పని చేసినాననుకొన్నావా? అందులోకి ఇటువంటిసొమ్ము పుచ్చుకొంటానా?"అని పళ్లెం ముట్టుకోనైనా ముట్టుకొన్నాడు కాదు.

చెంగ—అమ్మనాయనా! ఎలాంటివాడో! ప్రతివాడూ మనలాంటివాడే అనుకొంటాము. కాని, నీతోనేనూ కాశీవాసానికి వస్తే?

నాగ—నా అవస్థ నీకు పట్టలేదు. నీకు ఉద్యోగం ఒక్క సంవత్సరమే తప్పించినాడు. నీ డబ్బంతా ఉన్నది రెండూ పోయినవాడను నేను. నాపాపాలన్నీ నాహృదయం దొల్చివేస్తున్నవి. "నపశ్యామిసమంపాపం మిత్రద్రోహ్యం" అన్నాడు శంకరుడు పార్వతితో. ఆ అప్రాయశ్చిత్త పాతకము చేసినాను, శాస్త్రియెడల. నాయుడూ, భగవంతు

మున్నాడు; ఉన్నాడు. ఇది ఇన్నాళ్లూ మరచిపోయి, నన్నెవడేమి చేస్తాడని మదించి చేయరాని ద్రోహాలు ఎన్నో చేసినాను. ఈ డబ్బంతా న్యాయమార్గాన్ని ఎలాగొస్తుందని శాస్త్రి అన్నాడంటే తప్పేమి? నాయుడూ, భగవంతు డున్నాడని మరువకు. నా పాటవల్ల బుద్ధి తెచ్చుకో. ఈ రాత్రి నాప్రయాణం. మరినన్ను చూడకు. నేను వెళ్లేవరకూ, నేను వెడలి పోయినానని ఎవరితో చెప్పకు. యోగ్యుడవుగా ఉండు. మరిశెలవు. (తెర)

## అ యి ద వ రం గ ము

### సుందరమ్మపేట, గోపాలశాస్త్రితోట

ప్రవేశము—రాజు, రాణీ, గోపాలశాస్త్రి, జానకి, గిరిజ, వెంకు బాయమ్మ, వేణమ్మ. రాఘవరావు, శ్యామలారావు, కృష్ణావధాని. నిరంకుశవాణి, నారాయణచెట్టి, గ్రామస్థులు మొదలయినవారు.

రాజు—బాబూ, ఈచిన్నతోట మనరాజధానిలో క్రొత్తతోట, గోపినాథ్విలాస్కంటెఎంతోరమ్యంగాఉన్నది. రెండు నెలలు మీయిద్దరూ ఇక్కడలేకపోయినా ఇలాగుండుట నీసుగ్రీవాజ్ఞను తెలియజేస్తున్నది. మీయిద్దరికీ దీనియందు అంతప్రీతిఉండడంఆశ్చర్యమేమి? మేమున్నంతకాలమూ మేమేరాజ్యభారము వహించవలసినదని నీ వనబట్టిగాని ఇందులోమేమిద్దరమూ కృష్ణావధానిని దగ్గరనుంచుకొని తపోనిష్ఠలో ఉండిపోవలెననుకొన్నాము. ఇదినీవు వేసవికాలపు రాజధానిగా చేసుకొంటావాయేమి?

గోపాల—మహాప్రభూ, నేనిదికృష్ణావధానికిచ్చివేసి, పలినవారివద్దనే ఉంటాను.

రాజు—బాబూ, కృష్ణావధానివంటి పండితుడు, యోగ్యుడూ మా కుమార్తెకు వివాహముచేయించినందుకు మాకుఎంతో ఆనందముగా

నున్నది. అవధార్లీ, మేము మూడు వెయిన్నూట పదహార్లు బహుమ
గా ఇస్తున్నాము.
కృష్ణా—మహాప్రభూ, నాప్రియమిత్రుడు గోపాలశాస్త్రి ఏలిన వారి
అల్లుడగుటతో మాకుపదనిసాటికాదు. యువరాణీవారు ఇటువంటిచి
న్నామములో గృహప్రవేశమగుటకు దయచేసినారు, సుందరమ్మ
పేట ఆ యసమానగౌరతగాంచుటకు ఎంతనోచియున్నదో! ఈవేనవే
లుకృషికులు—
నిరంకుశ—వ్యవసాయదారులనకూడదూ? కృషికులట!
కృష్ణా—ఈవేనవేలు బ్రాహ్మణులు, ఎన్ని గ్రామములనుండో ఈమ
హోత్సవముచూచి తరించుటకువచ్చియున్నారు.
నిరంకుశ—గొంతుకలోకి తిండివచ్చేవరకూ మేపుతే, రా కేమి చేస్తారు?
కడుపుమీద వేలునొక్కవచ్చును, అలాగుతిన్నారు!
కృష్ణా—గోపాలశాస్త్రివంటి బ్రాహ్మణ సత్యముడు యువరాజుగానుం
డుటకు ప్రజలుఎంతధన్యులో!
నిరంకుశ—నందనవనమువంటి యిటువంటితోట మహా రాజావారికి
కూడా ఆనందము నతిశయింపజేసినది, ఇచ్చినందుకు బ్రాహ్మణపక్షపాతి సత్రము
డని అనవద్దా? నాకిచ్చినట్టయితే, దైవసమానుడని ఊరూర చాటిం
చియుందును. మేమిక్కడికి వచ్చినమూన్నాళ్ళూ, ఎక్కడ చూచినా,
ఎంగిలాకులే, ఎక్కడచూచినా యువరాజా గోపాలశాస్త్రివారినేపా
గడడమే! ఆయన లోపాలు ఎవరూకనిపెట్టలేదుగదా!
రాజు—నీవేమికనిపెట్టినావు, నిరంకుశవాణీ?
నిరంకుశ—చిత్తగించండి. ఒకటి:-లంచాలుఎక్కడా పుచ్చుకోకుండా
చేస్తారట. యువరాజావారు, నేయిరూపాయిల ఉపకారము చేస్తేగ
దా ఒకవందరూపాయిలుపారవేస్తారు? ఇచ్చినవాడుసంతోషించి, పు
చ్చుకొన్నవాడుసంతోషిస్తూఉంటే, మధ్య యువరాజావారికేమి పో
యింది దాన్నిఆపడానికి? పూర్వము ఏలాగుండేది? మహారాజావారి
ఖాస్‌నవుఖర్ కట్టినమేడవంటిది కనపర్చండి. ఎందరికిఎంతేసి ఉపకా

గాలు చేయించినాడు? మళ్ళీ జీతంపదిహేనే! జీతంలో ఏమున్నదంటాను. ఇటుపైని చిత్తగిస్తారు. దివానుగారు స్వయంగా బజారుకు వెళ్ళి కూర కొనుక్కోవలసినదే! ఆక్రిందివుద్యోగస్థులు కూరలేకుండాతినవలసినదే! ఇప్పుడు ఆడుపకారా లెక్కడ? కారాలే, మిరియాలే?

కృష్ణా—న్యాయాన్యాయములు___

నిరంకుశ—ఊడవయ్యా! రెండవది-నేరాలు ఎక్కడా లేకుండా చేయడానికి ప్రయత్నిస్తారట! నేరము ఎప్పటిది? రాములవారి నాడు లేదూ? లేకుంటే సీతాదేవిని ఎత్తుక పోవడమేమిటి? సృష్టి, నేరము, కవలవాళ్ళు. అది లేకుండా చేయడం ఎవరి తరము? రాములవారు చేయగలిగినారా? కృష్ణావతారములో ద్రౌపదిని సభలో మానభంగం చేయడమేమిటి? అది అలాఉంచండి నేరముచేయడానికి ఎంత తెలివి కావాలి! దాన్ని పట్టడానికి పోలీసువారికి ఎంత తెలివి కావాలి? నేరము చేసినాడని, చేయలేదని, ఈప్రక్క, ఆ ప్రక్క వాదించడానికి ప్లీడర్లకు ఎంత తెలివి ఉండాలి! అందులో న్యాయం కనుక్కోవడానికి జడ్జికి ఎంత తెలివి కావాలి! ఇందరి తెలివికి ఆధారభూతమయినది నేరమేనా? తెలివికి ఆధారమైన పాతశాలలు లేకుండా చేస్తే ఎంతయోగ్యతో, నేరము లేకుండా చేయడమనేది అంత యోగ్యతే!

మూడవది—ఎక్కడా ముష్టివాళ్ళుండ కూడదట! చేయికాలు లేనివారికి సత్రవులు పెట్టిస్తారట. బాగుంది, ఎవరూ అక్కడికి వెళ్ళరుగాని, పనిచేసుకో గలవాడు ముష్టికిబయలుదేరి నాడంటే, చెరసాలకు ఈడ్చుకో పోవడమే.

ఒకడు—అందులో తప్పేమున్నది?

నిరంకుశ—ఇందులోఉన్న సొగసుసాధారణంగా ఎవరికీ స్ఫురించదు. యాచకులే లేకుంటే, ధర్మము ఎవరికిచేయడం? ఈవి అన్నమాటే ఉండదు అనేకనేకాల! ధర్మం అడుగంటడమే! అది దానిలోఉన్న ధర్మ సూక్ష్మము.

నాలుగవది—యువరాజావారు ఉషఃకాలమున లేచి, స్నానముచేసి, ముక్కు బిగించుకొని గంటలకొలది కూర్చోవడం! ఏమండీ రాజశ్రీవి ఏమీ అక్కరలేదూ? ఎవరు పడితే వాళ్లు తిన్నగా వారి సముఖమునకు వెళ్లిపోయి మొరపెట్టుకోవడమేనట! ఔరా! పూర్వము [illegible], రాజదర్శనము కావడానికి మాసాలుతరబడి పడిగాపులు పడికుంటే, అయితే అయేది, లేకుంటే లేనేలేదు. రాజదర్శనము ఇంత చౌకచేసి వేయడమే?

అయిదవది—శంకరశాస్త్రివంటి సత్యాసక్తులు, దివానువంటిప్రయోజకులు దేశము విడిచిపెట్టి లేచిపోవడానికి కారకులు ఎవ్వరు? యువరాజావారేకదా? ఈ[illegible]ని ఎవరివంతు, ఎవరివంతని అంతా అనుకొంటున్నారే!

ఇన్నిలోపములు ఊరకే పోవునా? వారికి చాలామందిపిల్లలు కలుగడం, ఒక్కొక్క కుమారుడు ఒక్కొక్క రాజ్యముగెలిచి దానిని ఏలుతూ, వృద్ధులయిన తల్లిదండ్రులవద్ద ఒక్కరూలేకపోవడమూ, కుమార్తెలు గొప్పరాజులను పెండ్లాడి వారిపిల్లలతో అటువంటి బాధలుపడుతూ తల్లిదండ్రులను చూడడానికి వీలులేక ఉండడమూ వీరిచర్య దూరభవిష్యత్తులో ప్రజలు ప్రశంసించడం—అదే వారిలోపములకు తగినపని. నామాటకు పరమేశ్వరుడు తథాస్తు! అని అనడా?

## ఆంధ్రభారతి

సం॥ చందా 3 రూ॥ సంపాదకుడు:— తల్లాప్రగడ రామారావు

సార్థకనామధేయముఁ గలిగిన యీమాసపత్రిక బందరు నుండి ప్రతిమాసము సక్రమముగ వెలువడు చున్నది. ఆంధ్రపద్యరత్నములకు, కథలకు, కళలకు, వృత్తాంతములకు నిదిపుట్టినిల్లు. భాషాభివృద్ధికిఁ బాటుపడుచున్న పత్రికలలో నిదిమిన్నయని [illegible]దము. ప్రతిభాషాభిమాని తప్పక చదువవలసిన మాసపత్రిక యిదియే.

---

## రాష్ట్రేతరాంధ్రులు ఖర్గపురం (B.N.RY)

సం॥ చందా 1రూ॥ సంపాదకుడు:— ఆంధ్రసభారత్న భండారు దండపాణి పంతులుగారు ఖర్గపురస్థ ఆంధ్రజన సంఘమునుండి సక్రమముగ రాష్ట్రేతరాంధ్రులయభ్యుదయముకొఱకు వెలువడుచున్నది. ముఖ్యవృత్తాంతములతో, వివిధవిషయములతో, మృదుమధుర పద్యములతో, మనోరంజకముగ నున్నదని చదివినవారు వేనోళ్ల ఘోషించుచున్నారు. ఆంధ్రసోదరుల ప్రోత్సాహమునకు, మన్ననలకు, దగిన పత్రిక యిది.

---

## రత్నగిరి

సం॥ చందా॥ 3రూ. సంపాదకుడు:—కన్నెల్లి మునిరెడ్డి.

రత్నగిరి పత్రికా కార్యాలయము, కాళినాయకనపల్లి, కెలమంగలము పోష్టు, శేలంజిల్లా. అనివెంటనే వ్రాసి తెప్పించుకొని చదివి యానందింపుడు. రెడ్డికులాభ్యుదయమునకు, భాషాభ్యుదయమునకు నిరంతరాయముగ, శక్తిసామర్థ్యములు గలవారిచే ప్రకటింపబడుచున్న పత్రికారత్నము రత్నగిరి. నమోనాగా, ఒకవిడిపత్రిక తెప్పించుకొని చదివిన మీకే బోధపడ గలదు.